# ప్రఖ్యాత నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| మర్డర్ | (డిటెక్టివ్) | 1-8 |
| బ్యాండిట్ | | 1-8 |
| పాతాళగృహం | | 1-8 |
| నేనూ-మాజానకి | | 1-8 |
| మాధురి | | 1-0 |
| మోహిని | | 1-0 |
| ఎడ్డీఫోలో | | 1-0 |
| చండశాసిని | | 1-0 |
| మగపిశాచి | | 1-0 |
| దండధరుడు | | 1-0 |
| దివిటీదొంగలు | | 1-0 |
| సి. ఐ. డి. | | 1-0 |
| అన్ జాన్ డాకూ | | 1-4 |
| ఎ.బి.సి. హత్యలు | | 1-0 |
| ఖూనీపై ఖూనీ | | -12 |
| తుఫాన్ మైల్ | | 1-0 |
| డాన్సింగ్ గరల్ | | 1-0 |
| సురస | (చారిత్రిక) | 1-8 |
| చాందసుల్తానా | | 1-8 |
| అమరవిజయం | | 1-8 |
| రుద్రమదేవి | | 1-8 |
| సాహసిక | | 1-8 |

ప్రాప్తిస్థానం

## కాళహస్తి తమ్మారావు & సన్స్,

**సంస్కృతాంధ్ర గ్రంథాలయం రాజమండ్రి.**

# రైన్ నదీ తీరంలో

శ్రీ జొన్నలగడ్డ వేంకటరాధాకృష్ణయ్య

కిశోర్ పబ్లికేషన్స్,
5/1, లియొనార్డ్ స్ట్రీట్,
రాయపేట :: మద్రాసు-14.

# భూమిక

మానవ మనస్తత్వం ఎంత విభిన్నమైనదో అంత విచిత్రమైనది. దానిగతులే అపూర్వం. ఒక్కొకరిని చూస్తే ఎంతో ఆకర్షణ, అభిమానం, ప్రేమ కలిగితే, ఒక్కొకరంటే అకారణమైన ఏవగింపు కోపం కలుగుతాయి. అటువంటి చిత్రసంఘటనల చిత్రణలో అపూర్వకౌశలాన్ని ప్రదర్శించే కథకులు బహు కొలదిమంది.

వారిలో రష్యన్ కథకుడు ఐవన్ సెర్గివిచ్ టర్గనేవ్ ఒకడు. ఆయన రచించిన "ఆస్యా" అన్న కథను ఆధారంగా తీసుకొనే ఈ నవలను వ్రాశాను.

—రచయిత.

# రైన్ నదీ తీరంలో



## రమాకాంతుని కథనం:

“నాకు అప్పుడు ఇరవైఅయిదేళ్లుంటాయేమో! మా నాన్నగారు మరణించారు. మా అమ్మ నా బాల్యంలోనే కాలధర్మం పొందింది. నాన్నగారు పరమపదించడంతో బోలెడు ఆస్తి—డబ్బు నా వశమైనాయి. వెనకాల మందలించేవారుగాని—సలహాలిచ్చేవారుగాని, అదుపాజ్ఞల్లో వుంచడానికి యత్నించేవారుగాని ఎవరూ లేరు. ఎన్నో ఏళ్ళు పెంచి పెద్దవాణ్ణిచేసిన తండ్రి గతించడంతో నా మనస్సు వ్యాకులితం అయినమాట నిజం. ఎలాగైనా కొంతకాలం విదేశాలలో పర్యటనచేస్తే మనస్సుకు ఊరట కలుగుతుందేమో అని ఆశించాను.

డబ్బు పుష్కలంగావుంది—తరుణ ప్రాయమాయె. ప్రపంచాన్ని గురించిన ఊహ లెన్నిటితోనో నా మనస్సు నిండిపోయివుంది. దేశదేశాల ప్రజల్ని—వారి ఆచార వ్యవహారాల్ని, సంప్రదాయాల్ని చూసిరావాలనే కోరిక ప్రబలం కాగా, ప్రపంచ పర్యటనకు బయలుదేరాను.

అప్పట్లో నాన్నగారు ఘోయారనే విచారంతప్ప, మనస్సుకు ఆవేదనకలిగించే పరిస్థితులు ఏవీలేవు. కష్టంఅంటే ఏమో కూడా తెలియని పరిస్థితిలో—ముందేకాని వెనుక చూసుకోని ఉత్సాహంలో—మానవుడు వృక్షంవలె చిరకాలం వర్ధిల్లనేరడనే సత్యాన్ని గుర్తింపజాలని అజ్ఞానంలో రోజులు గడిపిన కాలమది.

యౌవనం ఏవిధంగా మానవునకు శాశ్వతం కాదో—అలాగే సంపదలుకూడా శాశ్వతం కావని—నిజానికి జీవితం క్షణభంగురమైనదని గ్రహించడానికికూడా వ్యవధిలేకుండా మానవజీవిత పరమావధి ఆనందానుభవమే అని, కోరినదికొని కావలసినది తెచ్చుకుని మూడుపువ్వులు, ఆరు కాయలుగా జీవించడమే లక్ష్యంగా భావిస్తూ గడిపిన సుదినాలవి. సరే దానికేమి లేండి.........

ఒకలక్ష్యం, ఒక గమ్యస్థానం లేకుండా ఎన్నెన్నో దేశాలు తిరిగాను. బలిద్వీపంలోని సుందరాంగుల నాట్యాన్ని—జపాన్ లోని గైషాలను-ఆస్ట్రేలియాలోని రైతు జీవనాన్ని-ఫిలిప్పీన్స్ దీవుల సౌందర్య గరిమను—అమెరికాలోని మహోన్నత సౌధాల రామణీయకతను—చికాగో, శాన్‌ఫ్రాన్సిస్కోలలోని సుందరప్రదేశాలను, హాలీవుడ్‌లోని ఫిలింస్టుడియోలను—ఎన్నిటినో దర్శించాను.

ఒకచోట ఇన్నాళ్ళువుండాలనే నిసుబులేదు. ఒకచోట ఫలానా హోటలలో బసచెయ్యాలనే నియమంలేదు. నా ఇష్టం

వచ్చినన్నాళ్ళు వుండడం—ఎప్పుడైతే ముఖ్యంగా కొత్త ముఖాలకోసం — కొత్తతావులకోసం ఎదలో తహ తహ ఉత్పన్నమౌతుందో, అప్పుడు అక్కడనుంచి బయలుదేరడం— అదే నా పని.

అమెరికా పూర్తిగా చూసినపిదప ఇంగ్లండుకు బయలు దేరివెళ్ళాను. లండన్‌లో నాలుగు నెలలుండి—నగరంలోని కల్లోలిత జీవనం అంటే విసుగుపుట్టి ప్రశాంతంగా వుండే కౌంటీలకు బయలుదేరాను.

కొన్నాళ్ళు కెంట్‌లో—కొన్నాళ్ళు బ్రైటన్‌లో మరి కొన్నాళ్ళు టాటెన్‌హాంలో, ఇంకొన్నాళ్ళు బ్రిస్టల్‌లో గడిపాను. ఆ తర్వాత రష్యాకు వెళ్ళాను.

సోవియెట్ కార్మికులను—రైతులను - ఉద్యోగులను - శాస్త్రవిజ్ఞానవేత్తలను దర్శించాను. వారి జీవితవిధానాన్ని పరిశీలించాను. ఇతరదేశాలలోని సాంఘికవ్యవస్థకు—ఇతర దేశాల సిద్ధాంతాలకు, రష్యా సిద్ధాంతాలకు గల వైరుధ్యాన్ని గమనించాను.

రష్యానుంచి పోలెండ్, యూగోస్లావియా, చెకోస్లో వాకియాలను దర్శించి చివరకు జర్మనీ చేరుకొన్నాను. జర్మనీ శోస్త్రాలో ఆరోగ్య కేంద్రాలని ప్రసిద్ధిపొందిన నగరాలను ఒక్కొక్కటే సందర్శించసాగాను. ఏ నగరంలోగాని శిలా స్తూపాలు, శిలావిగ్రహాలు నా దృష్టి నాకర్షించలేదు. ఏ చారిత్రక సంఘటనలు నా హృదయాన్ని ఆకర్షించలేదు. ప్రజలు-

ముఖ్యంగా మధ్యతరగతి సామాన్యప్రజలే నన్ను ఎక్కువగా ఆకర్షించేవారు.

ప్రకృతి-చిగిర్చిన చెట్లు-మంజులంగా ఏదో అవ్యక్తమైన రొద చేస్తూ ప్రవహించే నదీ నదాలు - గంభీరంగా ఘోషించే సముద్రాలు—మహోన్నతములైన పర్వతాలు—ఇవంటే నాకు ఇష్టమేకాని అవి నా స్వేచ్ఛావిహారానికి అడ్డురావడం కాని, నా మనోభావాలను వికలం చెయ్యడంగాని నాకు సమ్మతంకాదు.

విభిన్న ప్రకృతులు గల మానవులను చూడడం - వారి నవ్వుల్లో—సంతోషంలో—మాటలలో పాల్గొనడం—అదే నా అభిమతం—అది లేకపోతే నాకు ఆ రోజులలో జీవించడమే దుర్ఘటమైవుండేదనుకొంటాను. జనం గుంపులుగా వెడుతూ వుంటే వారితో కలిసి నడుస్తూంటే—వారిమాటలను—కేరింతాలను వింటూవుంటే నాకు ఏదో చెప్పరాని ఆనందంకలిగేది. మానవప్రకృతి పరిశీలన నాకు ఎందుకోగాని అనంతమైన సౌఖ్యం చేకూరేది.

జర్మనీలో, రైన్‌నది ఎడమగట్టునవున్న ఒక పట్టణంలో వున్నప్పటిమాట. ఆ పట్టణంపేరు ఎస్సెన్—ఏకాంత జీవనం కోసం నా హృదయం ఆరాటపడ్డ రోజులవి. అంతకుముందే హాంబర్గ్‌లో ఒక రెణ్ణెల్లు వుండివచ్చాను. ఆ రెణ్ణెల్లలోను ఒక జర్మన్ యువతితో పరిచయం కలిగింది. ఆమె వితంతువు. అయితేనేం ఆమె తరుణప్రాయం, అనన్య సౌందర్యం, అపూర్వ

సంభాషణ చమత్కృతి నన్ను ముగ్ధుణ్ణిచేశాయి. కనబడిన—పరిచయం చేసుకోగలిగిన ప్రతీయువకుణ్ణి ఆమె ప్రేమించేది. ఒక హోటల్‌లో ఇద్దరం ఒకనాడు తారసిల్లాం. మాచూపులు కలుసుకొన్నాయి. చూపులతోపాటు హృదయాలుకూడా ఏకమైనాయి.

ఏకమైనాయని అనుకొన్నదినేనే. ఆమెకాదు. ఏకమైనట్లు భావించిందీ నేనే. నటించింది ఆమె. ఆ ప్రేమ ప్రతిక్షణ చపలమైనదని—ఆమె నన్ను ప్రోత్సహించి—ప్రోద్బలించి, ప్రేమించినట్లు నమ్మించి, వలపించుకొని, నెలరోజులకుపిమ్మట ఒక బవేరియన్ సైనికోద్యోగితో అకస్మాత్తుగా లేచిపోయిన తర్వాత వ్రాసిన ఉత్తరం నా హృదయానికి ఎంతో వ్యథ కలిగించింది.

వ్యథ కలిగిందేగాని హృదయం ఆమె ప్రణయవంచన మూలంగా తీవ్రంగా గాయపడలేదు. కొన్నాళ్లు ఒంటరిగా విచారంగా గడిపితే మనస్తాపం కొంతవరకు చల్లారవచ్చునని తోచింది. కనకనే ఎస్సెన్‌లో వుండిపోయాను.

రెండు ఉన్నతపర్వతాల పాదం దగ్గరవుంది ఆ పట్టణం. పురాతనమైన కట్టడాలు—శిథిలమైన గోపురాలు, పొగతో నల్లబారిన గొట్టాలు గల కర్మాగారాలు—రైన్‌నదినుంచే ప్రవహించే ఒక ఉపనదిమీాది వంతెన—అన్నిటికంటె రుచ్యమైన ద్రాక్షసారాయం—ఇవి అన్నీ నాకు ఆ పట్టణంమీాద ఎక్కువ మక్కువ కలిగించాయి.

అది జూన్ నెల. సాయంసమయాలలో సూర్యుడు అస్తమించి ఆకాశంమీది వింతవింతరంగులు రైన్‌నదీజలంలో ప్రతిఫలిస్తూ ఎంతో శోభాయమానంగా కనిపిస్తూవున్నప్పుడు పట్టణంలోని జర్మన్ యువతులు నదీతీరానికి జట్లుజట్లుగా షికారు వచ్చేవారు.

విదేశీయులు ఎవరైనా కనిపిస్తే ముసిముసి నవ్వులతో మెల్లగా ఏదో అనేవారు. ఆ యువతులు—ఆకాశంలో చంద్రుడు ఉదయించి ఆ కిరణాల కాంతి పట్టణాన్ని ముంచెత్తే వరకు—రైన్‌నదిలో విలాస పురుషుల నావ షికార్లు ఆఖరైపోయేవరకు నదిఒడ్డున కూర్చుని—ఏవో కబుర్లు చెప్పుకుంటూ కిచకిచలాడేవారు.

ఆ నవ్వులు నా మనస్సును నిర్భరానందంతో నింపేవి. నదీతీరాన పేదకార్మికుల ఇళ్ళ కిటికీలనుంచి కనిపించే క్రొవ్వొత్తిదీపాలు-నిర్మలాకాశం-వెన్నెల-చల్లగాలి-పట్టణపు స్తబ్ధత-రైన్‌నదీ తరంగాల మర్మరధ్వని-ఇవి నా ఆత్మను ఏ దివ్యలోకాలకో గొనిపోయేవి.

ఈ ప్రశాంతిని అప్పుడప్పుడు ఒకకుక్క భోంయ్‌మనే అరుపో-లేక నిద్రమత్తున జోగుతూ ఉలికిపడి ఠాణాలో పహరా భటుడు కొట్టేగంట ధ్వనో పోలీసువాని ఈలో ఛేదించేవి.

ఒకప్రక్క నిమ్మతోటలనుంచి వీచే సౌరభాంచితమైన మందమారుతం—మరొకప్రక్క ద్రాక్షతీగలనుంచి వ్యాపించే ఘాటైన కమ్మటి సువాసన—మనస్సులో ఏవో అవ్యక్త మధురమైన కోరికలను రేపేవి.

ఎస్సెన్‌కు ఎగువను రైన్‌తీరంలోనే లిప్పీఅనే పట్టణం వుంది. సాయంసమయంలో నేను యాష్ చెట్టునీడనున్న శిలా ఖండంపై కూర్చునేవాణ్ణి. ఒకనాటి సాయంకాలం ఆ శిలా ఖండంపై నే కూర్చున్నాను. ఒకసారి నదివంక—ఒకసారి చిత్ర విచిత్ర వర్ణాంచితమైన ఆకాశంవంక చూస్తున్నాను. కొందరు జర్మన్ బాలురువచ్చి నదిగట్టున ఒకకొయ్యకు కట్టివేయబడి వున్న నావపై కూర్చుని ఏవోకబుర్లు చెప్పుకొంటున్నారు.

నదికిఆవలిగట్టున క్రెఫీల్డ్ అనే పట్టణంవుంది. ఉన్నట్లుండి ఆ పట్టణంనుంచి ఏవో పాటలు—ఎంతోమంది కలిసి పాడుతు న్నవి—ఫిడేల్, ఫ్లూట్, శాక్సోఫోన్ వాద్యాలమధ్య వినబడ సాగాయి.

"ఏమిటా పాటలు?" అని నావలో కూర్చున్న ఒక బాలకుని అడిగాను.

"డూష్‌బెర్గ్‌నుంచి విద్యార్థులు వచ్చారు. ఏదోవుత్సవం సందర్భంలో వారు ఆపాటలను పాడుతూన్నా" రని వచ్చీరాని ఇంగ్లీషులో చెప్పాడు.

ఒక నావవానిని పిలిచాను. ఆవలిగట్టుకు తీసుకువెళ్ళ మన్నాను. ఇంతవరకు క్రెఫీల్డ్ చూడనేలేదు. పోనీ, ఒకసారి ఈసందర్భంలో నైనా చూచినట్లవుతుంది అనుకున్నాను.

# 2

కొన్ని విశ్వవిద్యాలయాలకు చెందిన విద్యార్థులు ప్రతీ ఏటా ఒకేరంగు దుస్తులు ధరించి—ఏదో ఒకచోట ఉత్సవం జరపడం మామూలట. అలాగే ఆ సంవత్సరం క్రెఫీల్డులో సమావేశమైనారు. ఒక హోటల్ ఆవరణలో—తోరణాలు కట్టారు. స్టేజీనిర్మించారు.

ఆ స్టేజిపైన—జర్మన్ యువకులు కొందరు మహోత్సాహంతో పాటలు పాడుతూంటే — కొందరు రకరకాల జంత్రాలను వాయించసాగారు.

కొంతసేపు పాటలు—తదుపరి ప్రసంగాలు ఆతర్వాత ఏకపాత్రాభినయం—పిమ్మట నాటిక—విందు—అది ఆనాటి వారి కార్యక్రమం.

క్రెఫీల్డ్ ప్రజలు ఈ ఉత్సవాన్ని చూడడానికి గుంపులుగావచ్చి — హోటల్ వెలుపల నిలబడ్డారు. కొందరు గోడలపైకి ఎక్కారు. ఇంకొందరు ప్రక్కనేవున్న చెట్లకొమ్మల పైకి ఎగబ్రాకారు.

నవయౌవనోత్సాహం తొలుకాడే ఆయువకుల ముఖాలు—నిష్కాపట్యమైన వారి నవ్వులు—పరిహాసాలు—ఆటలు, పాటలు ఇవినాకు నిరవధికమైన ఆనందం కలిగించాయి. ప్రపంచంలోని కష్టనిష్ఠూరాలను గుర్తెరుగనేరని వారి కోలాహలం నా చిత్తాన్ని సంతోషతరంగితం చేసింది.

ఆ గుంపులో కలిసిపోయి వారి ఆటపాటలను ఆలకిస్తూ వుండగా "వినతా! ఇంకా చాలదా?" అన్న మాటలు హిందూస్థానీ భాషలో వినిపించాయి.

జర్మనీలో—నాదేశపుభాష విని నేను చకితుడనై వెనుదిరిగి చూశాను. అతడు కాశ్మీర్ దేశస్థునిలా కనిపించాడు. అతని ప్రక్కనే ఒక యువతివుంది. గులాబీరంగు సిల్కుచీర, తెల్లవాయిల్ జాకెట్—మెడలో సన్ననిగొలుసు—చేతులకు రెండుజతల గాజులు—ఎంతో నాజూకుగా - అందంగా ఆకర్షణీయంగా వుంది.

"ఇంకా కాస్సేపు వుందాం" అంది ఆమె.

"మీరు ఇండియానుంచివచ్చి యిక్కడవుంటున్నారా?" అన్నమాట నా నోటనుంచి అప్రయత్నంగా వెలువడింది.

"అవును. మీరు."

"నేనూ భారతీయుణ్ణే. బెంగాలీని. అయితే భారతీయులమైన మనం—ఎక్కడో విదేశంలో - ఇటువంటి సందర్భంలో తారసపడడం చిత్రమే."

"చిత్రమే. మాది కాశ్మీర్. నా పేరు గోవింద అవస్థే. ఈ అమ్మాయి నా-" అని ఒకక్షణంఆగి "చెల్లెలు" అన్నాడు.

"ఏడాదినుంచి విదేశాలలోనే తిరుగుతున్నాం. లండన్‌లో తప్పితే మాకు మళ్ళీ భారతీయులు ఎక్కడా కనబడలేదు. నిజంగా నేడు సుదినం" అన్నాడు మళ్ళీ అతడే.

అతనిముఖంలో - కళ్ళలో సుఖసంతోషాలు గోచరిస్తు న్నాయి. మాటలోసంస్కృతి ధ్వనిస్తూవుంది. కళ్లలో ఆప్యాయ నాదరణలు ప్రతిబింబిస్తున్నాయి. నిజంగా అటువంటి సంతృప్త మైన - హాసోజ్వలమైన ముఖాలుగల వ్యక్తులు అరుదుగా కనిపిస్తూ వుంటారు.

వారిముఖాలను మనం చూడకనే-వారి కంఠస్వరాన్ని వింటున్నప్పుడు కూడా వారు నవ్వుతూ మాట్లాడుతున్నారనే చెప్పగలం.

ఆతడు తనచెల్లెలు అని చెప్పిన యువతికి - అతనికీ పోలి కలో యెక్కడా సారూప్యం లేదు. అయినా ఎంతో చక్కగా వుంది. కళ్ళు విశాలంగా మిలమిల మెరుస్తున్నాయి. బుగ్గలు పాలుబికుతూ వున్నాయి. మాటతీరులో- నవ్వులో-ఏదో ఒక విశిష్టత, ఒకప్రత్యేకత గోచరించింది.

"ఈ జర్మన్ యువతుల కేరింతాలను అరగంటనించి వింటున్నాం. వినతా! ఇకపోదాంరా. ఏమండీ! మీపేరేమిటి?"

"రమాకాంత బోసు. మేము బెంగాలీలమని ముందే మనవి చేసుకున్నాను."

"మా ఇంటికిరండి. ఈ పూట మా ఇంటిలో భోజనం చేద్దురుగాని" అని ఆహ్వానించాడు అవస్థే. నేను కాదనలేక పోయాను. తిన్నగా పట్టణం వెలుపలగల పొలాలకు అడ్డపడి రెండు ఫర్లాంగుల దూరం నడిచి, ఒకగుట్టపైనున్న ఇల్లు చేరు కున్నాము.

ఇంటికిపోయే మార్గానికి ఉభయపార్శ్వాలలోను ద్రాక్ష తీగలు వ్యాపించి వున్నాయి. అప్పుడే సూర్యుడు గాయపడిన యుద్ధవీరునివలె పరుగిడుతున్నాడు.

మెల్లగా ఆ సన్నని మార్గంమీదుగా గుట్టపైనున్న ఇంటిని చేరుకోగానే "ఎలావుంది ఇల్లు" అని అడిగాడు అవష్తే.

నిజంగా అక్కణ్ణుంచి చూస్తే ప్రక్కనే పారుతున్న రైన్‌నది - కిలకిలమని నవ్వుతూ, ఎవ్వరికీ అర్థంగాని పాటలు పాడుతూ, చెట్ల కొమ్మలలోని రెమ్మలపై ఎక్కడో కనిపించీ కనిపించకుండా వుండే పక్షులు- అన్నివైపులా సస్యశ్యామలాలయిన పొలాలు-అత్యంత మనోహరంగా తోచింది ఆ దృశ్యం.

"కాలం గడపడానికి దివ్యమైనచోటు ఎన్నుకొన్నారు మిత్రమా" అన్నాను నేను.

"ఆ ప్రశంసకు నేను పాత్రుణ్ణికాదు. వినత పట్టణమంతా గాలించి చివరకు విశ్రాంతి - వెలుగు - గాలి ప్రశాంతి సమృద్ధంగా లభించే ఈచోటును ఎన్నుకొన్నది. పైగా వంటావిడ కూడా సహృదయురాలు. మూర్తీభవించిన కరుణరసం అంటే నమ్మండి. అయితే ఆవిడచేసేది పైపనే అనుకోండి. వంటంతా వినతే స్వయంగా చేస్తుంది. అయితే మనభోజనం ఈవిడ చేస్తే యూరోపియన్ భోజనాన్ని ఆవిడ సిద్ధంచేస్తారు."

"సెభాష్! బలే ఉపన్యాసధోరణిని అలవరుచుకొన్నావే" అంది వినత.

"మరి కానీ! భోజనం ఏర్పాట్లు! నీ హస్తప్రసాదానికే ఇక మానిరీక్షణ" అన్నాడు అవష్తే.

వినత లేడిపిల్లలా లోపలికి పరుగెత్తింది. ఇద్దరం మా ఉభయుల విదేశయాత్రా విశేషాలను చెప్పుకుంటూ కూర్చు న్నాం, ఒకటిన్నర గంటలు కబుర్లతో గడిచిపోయాయి.

ఇంటిముందు చిన్నతోటలో ఒక టేబుల్ దగ్గర మూడు కుర్చీలువేసి-మూడుప్లేట్లలో ఆహారపదార్థాలు అమర్చిపెట్టింది. రెండు గ్లాసులలో మాకు ద్రాక్షసారాయం నింపి - ప్రక్కన పెట్టింది. కెటిల్‌నుంచి పింగాణీ కప్పులలో కాఫీపోసింది.

అంతవరకు ఒక సిమెంట్ తిన్నెపై కూర్చున్న నేను, అవప్పేకూడా టేబుల్ దగ్గరకు వెళ్ళాం. ఆమె తనకుర్చీ మరి కొంచెం దూరంగాజరుపుకొని కూర్చుంది. అదిచూసి "ఏమిటది వినూ! అతనేం పరాయివాడా ఏమి? అలా దూరంగా వెడతా వేమిటి? దగ్గరగా వచ్చి కూర్చో. బిడియపడక, మాట్లాడు. అతడు నిన్ను కరుస్తాడా? రా" అన్నాడు అతను.

ఆమె సిగ్గుపడింది. కుర్చీ టేబుల్‌కు దగ్గరగా జరుపు కుంది. ఎలాగయితేనేం-మాతోపాటు భోజనం పూర్తిచేసింది. మెల్లమెల్లగా ప్రసంగంలో తానుకూడా పాల్గొనసాగింది.

ఆమె ఒక్కక్షణం నిలకడగా మా దగ్గరకూర్చోలేదు. అశాంతితో బాధపడుతున్నటుగా—ఒకసారి సిగరెట్ టిన్ను కోసం—ఒకసారి అగ్గిపెట్టెకోసం—ఇలాగే క్షణక్షణానికీ ఇంటిలోకి పరుగెత్తేది. తిరిగి పాడుకొనేది. తరచుగా నవ్వేది ఆ నవ్వు ఎందుచేతనో వింతగా ధ్వనించింది. తాను మా మాటలను వినిగాక తనకు జ్ఞాపకంవచ్చిన ఏ విషయాలకో ఆమె నవ్వినట్లు కనిపించేది.

మాపై వీచేగాలి ఎంత చల్లగావుందో—అంత చల్ల గాను సాగిన సంభాషణలో రెండుమూడు గంటలు కులాసాగా గడిచిపోయినవి. రిస్టువాచీ చూసుకొన్నాను. పదిగంటలయింది.

పరిచారిక తెచ్చిన ద్రాక్షసారాయం రెండుగ్లాసులు మళ్ళీ ఖాళీచేశాం. దూరాన జర్మన్ యువకుల సంగీతం వాయుతరంగాలలో లీనమౌతూవచ్చి మరింత హాయిగా వినిపించసాగింది.

నేను ఇక వెడదామని లేచాను. అవస్థే నాతోకూడా నదీతీరందాకావస్తానన్నాడు. తనూవస్తానంది వినత. ముగ్గురమూ ఏమో మాటలాడుకొంటూ నదీతీరానికి చేరుకొన్నాము. నావలో నేను కూర్చున్నాను ఇద్దరిదగ్గర సెలవుతీసుకొని.

మరునాడు తాను ఎస్సెన్‌కు వస్తానని అవస్థే వాగ్దానం చేశాడు. అతనితో కరస్పర్శ చేసి ఆమెకు కూడా చేతిని అందించాను.

ఆమె తనచేతిని సాచలేదు. "నమస్తే" అని మాత్రం మెల్లగా అంది.

నావ బయలుదేరింది. "గుడ్ బై" అంది ఆమె. "రేపు ఉదయంవరకూను" అన్నాడు అవస్థే.

నావనుంచి దిగి నేను పొలాలమీదుగా నడిచి, నా బసను చేరుకొన్నాను. నాకు ఎంతో సంతోషంగావుంది. ఎందుకు చెప్మా ఇంత సంతోషం కలిగింది అని నాలో నేనే ఆశ్చర్యపడ్డాను.

ప్రక్కపై మేనువాల్చి, కళ్ళు మూయగానే, నన్ను వలచినట్లు నటించి, వంచించిన జర్మన్ వితంతు యువతిని ఒక్కసారైనా ఆ పూట తలచుకోలేదని నాకు తట్టింది.

"ఏమిటి దీనికి కారణం ఒకవేళ నాకు వినతపై ప్రేమ గాని కలగలేదుగదా" అనుకొన్నాను. అలా అనుకొంటూ వుండగానే నిద్రాదేవత తన రెక్కలు నాపైన కప్పింది.

3

మరుసటి ఉదయం నేను మేల్కొని ఇంకా ప్రక్కమీద పడుకొనే కిటికీలోంచి అవతల పూల మొక్కల ఆకులపై పడ్డ సూర్యకిరణ కాంతిలో మిలమిల మెరుస్తున్న మంచు బిందువులను చూస్తున్న సమయంలో "బోసుమహా శయా! ఇంకను నిద్రనుంచి మేల్కొనలేదా ?" అన్న మాటలు వినిపించాయి.

నేను లేచి తలుపు తెరిచి, గోవింద అవస్థేను లోపలకు రమ్మని ఆహ్వానించాను.

"నేను మరీ పెందలాడే వచ్చి మీకు నిద్రాభంగం కలిగించలేదు గదా? అయితే చూడండీ! ప్రభాతం ఎంత కలకలలాడుతూ వుందో, అవిగో! లార్కులు కాబోలు ఎలా కిచకిచలాడుతున్నాయో !" అన్నాడు అవస్థె.

అప్పుడే వికసించినపువ్వల్లాగే అవస్థేకూడా నవోన్మేష తారుణ్యంతో విరాజిల్లుతూ వున్నాడు.

కాలకృత్యాలు తీర్చుకొని, స్నానంచేసి తోటలోకి వెళ్ళాం ఇద్దరమూను. నౌకరు కాఫీ తెచ్చి ఇచ్చాడు. త్రాగి, సిగరెట్లు అంటించి కబుర్లు ప్రారంభించాం.

అతడు తన పరిస్థితులను గురించి చెప్పారు వచ్చాడు. బాగా డబ్బున్నవాడు. వెనకాల బాధ్యతలు, పేచీపూచీలు ఏమీలేవు. జీవితాన్ని చిత్రలేఖనానికే అంకితంచేయ నిర్ణయించుకొన్న కళాజీవి. తనకు బాల్యంనుంచి చిత్రకారునిగా ఖ్యాతి పొందాలనేఅభిలాషవున్నప్పటికీ, చిత్రలేఖనం చాలాఆలస్యంగా ప్రారంభించాననే పశ్చాత్తాపాన్ని అతడు వెలిబుచ్చాడు.

నా భవితవ్యాన్ని గురించి అతనితో నేను చెప్పాను. హాంబర్గ్‌లో జర్మన్ యువతిని ప్రేమించిన సంగతికూడా దాచ లేదు. అతడు అంతా శ్రద్ధగా విన్నాడు. అన్నివిషయాల పట్ల ఆసక్తినీ సానుభూతినీ వెలిబుచ్చాడు. కాని జర్మన్‌యువతితోడి ప్రణయవ్యాసంగం అతనిలో ఎట్టి ఉత్సాహాన్ని గాని, శ్రద్ధా సానుభూతుల్నిగాని రేపలేకపోయింది.

చివరికి ఒక నిట్టూర్పు విడిచి "బాగానే వుంది" అని మాత్రం అన్నాడు.

ఆ తర్వాత తనతో క్రెకేల్డుకు వచ్చి తాను లిఖించిన చిత్తరువులను చూడగోరాడు.

సరేనని నేను క్రెకేల్డుకు బయలుదేరి వెళ్ళాను. వినత ఇంటిలోలేదు. దగ్గరలోనేవున్న ఒకశిథిలదుర్గానికి చూడడానికి వెళ్ళిందని పరిచారిక చెప్పింది.

అవస్థే రచించిన చిత్తరువులను చూశాను. వాటిలో శిల్పంవుంది. జీవంవుంది! అయితే అసంపూర్తిగానే వున్నాయి. అలక్ష్యంగా లిఖించినట్టుగా కూడా స్ఫురించింది. నాకు తట్టిన అభిప్రాయాన్ని నిర్మొగమాటమితో తెలియజేశాను.

అతడు నా నిష్కపటతకు సంతోషాన్ని వెలిబుచ్చాడు. తాను శ్రద్ధగా కళాభ్యాసనకు పూనుకొనడానికి అవకాశం లేకపోయిందని పరితపించాడు.

"ఇప్పటికీఎవరైనా గురువుదగ్గర కొంతకాలం ఈకళను అభ్యసింతామని భ్రమపడుతూ వుంటా. అయితే మరుక్షణం లోనే—ఇప్పటికే వయస్సు మీరిపోయిన సందర్భంలో ఇంకేమిటి నేర్చుకోవడం అని నిరాశపడుతూ వుంటాను కూడా. సాధనమానను. అది ఏనాటికైనా ఫలిస్తే సరేసరి. ఫలించకపోతే ఇలాగే—ఏవో అర్థంలేని చిత్తరువులే నా కుంచెనుంచి వెలువడుతూ వుంటాయి. రండి, వినతకోసం వెడదాం" అని గోవింద అవస్థే అనగా నేను మారుమాటాడక అతణ్ణి అనుసరించాను.

# 4

ఆ శిథిలదుర్గానికి పోయేమార్గం ఒక లోయగుండా వుంది. లోయకు కొంచెం దూరంలో ఒక కాలువ మెల్లగా ఏమీ తొందరలేనట్టు రైన్‌నదివైపుగా ప్రవహిస్తూ వుంది. అక్కడకు రైన్‌నది కొంచెం దూరాన మహావేగంగా ప్రవహిస్తూ రైలుకోసం పరుగెత్తే ప్రయాణీకుణ్ణి జ్ఞప్తికి తెస్తూ వుంది. ఒక అరమైలుదూరం నడిచినపిదప మాకు దుర్గం కనిపిం చింది ఆదుర్గం ఒక ఉన్నతపర్వతశిఖరంపైనవుంది. పూర్వంఎవరో కౌంట్ అందులో నివసించేవాడట. ఇప్పుడు మాత్రం ఎవరూ లేరు. కాని దుర్గంలోపల చూడవలసిన శిల్పం ఎంతైనావుంది.

ఆ శిల్పనైపుణ్యం అందులో నివసించిన కౌంట్ (మన దేశంలో రాజాలతో పోల్చవచ్చునేమో) కళాభిరుచిని విస్ప ష్టంచేయగలదిగా వుంది. ఇప్పటికీ ఆ రాతి స్తంభాలు—ఫిరంగి గుండుకుకూడా అభేద్యమైన కుడ్యాలు- స్తంభాల చివర నగిషీ పనులు—అలంకరణ—ఇవి కౌంట్ పూర్వోదంతం తెలిసిన వారి చిత్తాలలో ఏవో దివ్యస్మృతులను రేపుతూవుంటాయి.

దుర్గం గోడలపై లతలు వ్యాపించి వున్నాయి. దుర్గం శిథిలమైనా ఇంకా గేటువుంది. గేటులోనుంచి లోపలకు వెళ్లే సరికి ఒక మొండిగోడపై కూర్చుని రొట్టెతింటూవున్న వనిత కనిపించింది.

“ఆ గోడమీదనుంచి పడిపోతే—అరె పిచ్చిపిల్లలా వుందే మీ చెల్లి” అన్నాను నేను.

ఆమె మా వంక చూసి నవ్విందేగాని కూర్చున్న చోటు నుంచి కదలలేదు. మూపుడు వ్రేలుతో "జాగ్రత్త" అన్నట్లు గోవింద్ బెదిరించాడు. క్రిందికిదిగి రాకూడదా అని నేను కొంచెం చిరాకుగానే అన్నాను.

"చిరాకు పడకండి. దుర్గగోపురం మీదికే పోగలదు. వినత పెక్కడుూయింతే. మహా సాహసురాలు. చూడండి—ఈ కట్టడం ఎంతబాగుందో! — ఆహా ఏమి ఈ శిల్పవిన్నాణం" అన్నాడతడు.

నేను ప్రక్కకుతిరిగి ఆ దుర్గద్వారాలను—సింహద్వారానికి ముందుగా రాతితో చెక్కబడిన రెండుసింహాల ప్రతిమలను—క్రింద పరచబడిన రంగురంగుల పాలరాళ్ళను చూసి ఎంతో విస్మయం పొందాను.

ఆ దుర్గాన్ని చూడడానికి నిత్యం ఎవరోఒకరు వస్తూనే వుంటారు. వారికి అక్కడి పర్వత కనుమలనుంచి ప్రవహించే జలాన్ని—రొట్టెలను—సిగరెట్లను ఒక వృద్ధురాలు విక్రయిస్తూ వుంటుంది. ఆజలంత్రాగితే రోగనిర్ముక్తులం కావచ్చుననే ఆశతోనే దేశదేశాలనుంచి ఎందరో వస్తూవుంటారు.

వినత ఆ గోడమీద శిలాప్రతిమలా కూర్చునేవుంది. క్రిందికి దిగిరాలేదు. ఏమిటీ చిన్నతనం చేష్టలనుకున్నాను. నా చికాకును కనిపెట్టినట్లుగా నావంక ఒకసారి చురచుర చూసి, క్రిందకుదూకి, ఆ వృద్ధురాలి దగ్గరకు వెళ్ళి—ఒక గ్లాసునిండా జలంతీసుకొని-అవతలివైపు చూసి "అన్నా! ఈనీరు నేనుత్రాగడాని

కనుక్కొన్నావా ఏమి? కాదు. గోడమీద కొన్ని పూల మొక్కలున్నాయి. వాటికి" అంటూ చకచక గోడయెక్కింది.

ఒకచోట ఇటూఅటూ విరగబడి మరీ నడవడంతో క్రింద పడిపోతుందని తోచి ఆ! అన్నాను కూడా.

నయ్యారంగా గ్లాసులోని నీటిని ఏదో మహాఘనకార్యం చేస్తున్నట్లుగా తీవ్రమైన వైఖరితో ఆ మొక్కలకు కొంచెము కొంచెముగా పోసి క్రిందకుదిగి చక్కావచ్చింది. వచ్చిన తరువాత ఆమె పెదిమలపై తోచిననవ్వు విచిత్రంగావుంది. నోరు కొంచెంవంకరగాపెట్టి నావంక చూసినచూపు "నేను అల్లరిపిల్లనని మీరనుకుంటున్నారా! బలే తెలివైనదాన్ని" అన్నట్లుతోచింది.

"అత్యద్భుతంగా గంతులువేశావు. సర్కస్ క్వీన్ అన్న మాట" అన్నాడు అవస్థే.

"కాదు. లేడిపిల్ల" అని అందించింది ముసలమ్మ.

ఉన్నట్లుండి వినతముఖం సాయంసమయపు గులాబి పూవల్లే ముడుచుకుపోయింది. తన చిన్నతనపు చేష్టలకు సిగ్గు పడిందోఏమో—ఆమె ముఖమండలాన నవ్వుదొంతరలు తిరిగి కనిపించలేదు. ఎంతమంది స్త్రీల ముఖాలనో చూశాను గాని అలా క్షణక్షణానికీ వైఖరి మారిపోయిందే ముఖాన్ని మాత్రం నేను ఎక్కడా ఎప్పుడూ చూడలేదు.

కొన్నినిమిషాలు గడిచినవి. ఆమెముఖం వెల్లదనంపొందింది. ఏదో ఆలోచిస్తున్నట్లు—ఏదో విచారంతో బాధపడుతున్నట్లుగా కనిపించింది. అతినిశ్శబ్దంగా కూర్చుంది.

కొంచెం సేపైన తర్వాత మేము మళ్ళీ లేచి, దుర్గం చుట్టు తిరిగాం. వినత నన్నిమ్మల్ని అనుసరించిందే గాని—నవ్వు తుళ్ళు కూడా లేదు.

బాగా ప్రొద్దెక్కిందేమో—దాహబాధ సహనయించుకొనడానికి అవస్థే ఆ వృద్ధాంగన దగ్గరకు వెళ్ళి రెండు గ్లాసుల బీరు కొనుక్కొని వచ్చాడు.

ఇద్దరం గ్లాసులు ఖాళీ చెయ్యబోతూ వుండగా, అవస్థే యూరోపియనుల మర్యాద ననుసరించి "నీ ప్రియురాలి ఆరోగ్యం కోసం — గ్లాసెడు బీరు గుటగుటాయ స్వాహా" అన్నాడు.

"ఆయనగారికి ఎవరైనా ప్రియురాలు వుందా ?" అని అడిగింది వినత.

"ఎవరికి లేదు ?" అని ప్రశ్నించాడు అవస్థే.

ఆమె ఒక్కక్షణం ఆలోచనాధీన మైనట్లు నావంక నిశితంగా చూసింది.

దారిపొడుగున ఆమె ఎంతో ఉత్సాహంతో పాటలు పాడుతూ—చెట్లు కొమ్మలు విరుస్తూ—ఉల్లాసంగా నడవసాగింది. ఇల్లు చేరుకోగానే వంటలక్క సహాయంతో భోజనాలు వడ్డించింది.

కొత్తచీర—జాకెట్ ధరించివచ్చింది. భోజనాల దగ్గర ముభావంగావుంది. భోజనంచేశాక తనగదిలోకి వెళ్లిపోయింది. మరో అయిదు నిముషాలకు బయటకు వచ్చింది. జోళ్లు తొడుక్కొనివుంది. గొడుగు చేతబట్టుకొంది.

అవస్థి ఆమెవంక నాశ్చర్యంగా చూశాడు.

"ఫ్రాలూయిూ యింటికి ఒకసారి పోయివస్తాను. ఇవాళ మధ్యాహ్నం 12 గంటలకువచ్చి సాయంకాలందాకా కూర్చుంటానని నిన్ననే వాగ్దానం చేశాను" అంది.

"ఎక్కడికైనా వెడుతూ అనుమతి తీసుకోవడం ఎన్నాళ్లనుంచండీ రాణీగారూ" అన్నాడు అతను.

"వెళ్ళివస్తాను. మీరిద్దరూ ఏవో బొమ్మలను గురించి, సాహిత్యాన్ని గురించీ చర్చించుకోవచ్చును. రమాకాంత బాబు తన రహస్యాలను, మరికొన్నిటిని నీకు చెప్పవచ్చును కూడా" అంటూ నన్నుచూసి, కొంటెనవ్వుతో మూతిని వక్రంగాత్రిప్పి వెళ్ళిపోయింది.

ఫ్రాలూయిూ వితంతువు. ఆమెభర్త ఈ పట్టణం మునిసిపాలిటీకి మేయరుగా వుండేవాడట. ఒకసారి సినీమాలో ఇద్దరు కలుసుకొన్నారు. అప్పణ్ణించీ ఇద్దరికీ ఎంతో అన్యోన్యం. ఆమె 60 ఏళ్ళవృద్ధ అన్నాడు అవస్థి.

మరో రెండునిముషాలు ఆగి "ఆమెను నేను ఏమీ అనలేను. నావల్లనే ఆమె చాలాపట్టుకు పాడై పోయింది. ఎవరినీ నేను కఠినంగా చూడలేను. అందులోను వినతపట్ల దయతో, అభిమానం, ప్రేమ చూపవలసిన బాధ్యత నాపైన ఎంతైనా వుంది."

తిరిగి రెండునిముషాలు నిశ్శబ్దంగా వున్నాడు. ఆ తరువాత ప్రసంగం మరొక విషయానికి మార్చివేశాడు. అతణ్ణి

గురించి ఒక్కొక విషయమే తెలిసిన కొలదీ అతనంటే నాకు ఇష్టంకూడా ఎక్కువ కాసాగింది. అతడు నిష్కపటి. యౌవనో త్సాహం— సంపదలు— అతణ్ణి ఉన్మాదునిగా చెయ్యలేదు. ఉద్రిక్తునిగాకూడా చెయ్యలేదు. శాంత స్వభావం అతనిలో మూర్తీభవించింది. విలాస జీవనంపైనున్న కాంక్ష కారణంగా అలవాటు మూలంగా అతను చిత్రకారుడుగా ఎప్పటికైనా రాణించగలడాఅని నాకుసందేహంకలిగింది. చిత్తరువులను రచించడానికి కావలసిన సహనం-ఏకాగ్రత లేవేమో అని తట్టింది.

అయితేనేమి, అతని సంభాషణ సరళిని విన్నవారు అతని ఆకర్షణీయమైన సుందర వదనాన్ని చూసినవారు అతనితో స్నేహం చెయ్యకుండా వుండలేరు.

ఇద్దరమూ ఏవోకబుర్లుచెప్పుకుంటూనాలుగుగంటలసేపు గడిపాము. కాసేపు కూర్చుని కాసేపు పచారుచేస్తూ మరి కొంతసేపు వరండాలో సిగరెట్లు కాలుస్తూ కాలక్షేపంచేశాం.

అయిదు గంటలయింది. ఇంక ఇంటికి పోతానని నేను లేచాను.

"ఉండు బాబూ! ఇద్దరం అలా ప్రొలూయిా ఇంటికివెళ్ళి వినతను పిలుద్దాం. ఆమెతో చెప్పి, మీరు వెళ్ళిపోదురు గాని" అన్నాడు.

ఇద్దరిమధ్య సాన్నిహిత్యం అతిశయించిన కొలదీ మర్యాదలు పాటించడంకంటె - చనవుగా ఒకరినొకరు పిలుచుకోవడం ప్రారంభించాం.

వంటలక్క తెచ్చియిచ్చిన కాఫీసేవించి, ఉభయులం ఫాలైలూయిా ఇంటివైపు బయలుదేరాం.

ఫాలూయిా నివసిస్తున్నది మూడంతస్తుల మేడం "వినతా!"అని అవష్ఠె కేక వేశాడు. ఆమె మూడవఅంతస్తులోని ఒకగది కిటికీనుంచి తొంగిచూసింది. ఆమె ప్రక్కనే జర్మన్ వృద్ధాంగన నిలబడి వుంది.

కిటికీలోంచి ఆమె ఒక ఎఱ్ఱగులాబీ పువ్వును అవష్ఠెపైకి గిరవాటువేసి నీ మనస్సులోవున్న పిల్లని నేనే అనుకో అంది.

అతడు ఆపువ్వును అందుకొని "రమాకాంత బాబు వెళ్ళి పోతున్నాడు" అన్నాడు.

"అయితే ఆ పువ్వు ఆయనకియ్యి. నేను ఇప్పుడే క్రిందికి దిగి వస్తున్నాను" అంది.

మౌనంగా అవష్ఠె ఆ గులాబి పువ్వును నాచేతి కందిం చగా నేను దానిని కోటు పైజేబులో పైకి కనబడేటట్లుగా పెట్టాను. ఆమె ఇంటికి వెళ్ళిపోగా నేను, అతడు కలిసి నదీతీరా నికి వెళ్ళాం.

నేను ఇంటికి వెళ్ళిపోతూ వుండగా ఒకచోట మల్లెతీవ కనిపించింది. ఆతీవనుంచి ఘుమఘుమమని పరిమళం వ్యాపిస్తూ వుంది.

మల్లెలకు భారతదేశం ఎంతోప్రసిద్ధి. ఈదూరదేశంలోకి ఇది ఎల్లా వచ్చిపడిందో అనుకున్నాను. వెంటనే నా దేశం నా మాతృభూమి స్ఫురణకు వచ్చాయి.

ఎందుకీ లక్ష్యంలేని, ప్రయోజనంలేని వృథాప్రయాస? ఎందుకీ విఫలపర్యటన? అనే తాపత్రయంతో నామనస్సు వ్యథితమై పోయింది. నామీద నాకే కోపం, విసుగు కలిగాయి. చాలసేపటికిగాని ఆక్రోధాగ్ని చల్లారిందికాదు.

కొంతసేపు ప్రక్కపై పడుకున్నాను. తర్వాతలేచి సిగరెట్ అంటించాను. కుర్చీలోకూర్చుని నన్నువంచించిన జర్మన్ యువతిని తలచుకొన్నాను. ఆమెవ్రాసిన లేఖలలోని ఒక లేఖను తీశాను. ప్రతిరోజూ రాత్రివేళ ఒకసారి ఆమెను, ఆమె కపట ప్రణయ ప్రభావాన్ని తలుచుకొని మరీ నిద్రపోవడం అలవాటయింది.

ఇంతలోనే బుద్ధి మరొకత్రోవ త్రొక్కింది. ఈసారి నా మనోవీధిని మెరిసినది వినత. మా సంభాషణలో తాను భారత దేశానికి తిరిగి ఇంతలో రావడానికి ఏవో అభ్యంతరాలు వున్నాయని అవష్ఠె సూచించాడు.

"నిజంగా ఆమె అతని చెల్లెలేనా ?" అనే ప్రశ్న నా మనస్సులో తళుక్కుమని మెరిసింది.

"కాదు చెల్లెలు కాదు" అనే నిశ్చితాభిప్రాయం వెంటనే కలిగింది.........

జర్మన్ వితంతు ప్రేయసి వ్రాసినలేఖ కిటికీలోనుంచి లోపలకు ప్రసరిస్తున్న వెన్నెలకాంతిలో మెరుస్తూ క్రింద పడివుంది.

# 5

మరునాటి ఉదయం నేను బ్రేక్‌ఫాస్ట్‌కు వెళ్ళాను. అవస్థైను చూడడానికనే నేను బయలుదేరాను. కాని నిజానికి నా మనస్సును అటు లాక్కొని వెళ్ళింది వినత. ఆమె తొలినాటివలెనే - చిన్నపిల్లలా నవ్వుతూ - ఆడుతూ - పాడుతూ - పర్వత కన్యలా వర్తిస్తుందో - లేక ముభావంగా వుంటుందో చూద్దామనుకునే వెళ్ళాను. ఒక్కొకసారి పోలిష్ యువతిలా రెండు జడలు వేసి - ఫ్రాక్, జాకెట్ తొడిగి, ఎత్తు మడమలజోళ్ళు - టోపీపెట్టుకుంది. ఒకసారి చీరకట్టి - జాకెట్ తొడిగి—నల్లని అద్దాల కళ్ళజోడుపెట్టి—జుట్టు బర్మాముడి వేసుకుంటుంది. ఒక్కొకనాడు ఒక్కొక తరహా ముస్తాబు అవుతూవుండేది. ఆనాడు అచ్చంగా "బెంగాలీ" యువతిలా అలంకరించుకుంది.

రాత్రి నేను మాతృభూమిని గురించి పరితపించడం వల్లగాని వినత నేడీవిధంగా అలంకరించుకుందా అని ఎందుచేతనో నాకు తట్టింది. అవస్థై ఏదో బొమ్మ గీస్తున్నాడు. ఆమె లేసు కుట్టుకుంటున్నది.

"గుడ్ మార్నింగ్" అని నేనప్పుడు ప్రత్యభివందనం చెయ్యడం తప్ప, ఆమె మరేమీ మాటాడలేదు. లేసుకుట్టు తప్ప, జీవితంలో మరేపని చెయ్యనట్లు - తదేకదృష్టితో ఆమె కుట్టువంకనే దృష్టి సాగిస్తూవుంది.

కొంతసేపైన తర్వాత లోపలకు వెళ్ళి కాఫీ తెచ్చింది. ముగ్గురంత్రాగాం. అవస్థి దుస్తులుధరించి "భాయీ! కొంచెం బయట పనివుంది. ప్రకృతి చిత్రించడానికి - ఒక మైలుదూరం ప్రయాణం చేయబోతున్నాను" అని అన్నాడు.

"నేనుకూడా రావచ్చా - లేక..." అని నేననగా "ఓ! నిరభ్యంతరంగా; అమూల్యమైన మీ సలహాలు కూడా ఉపకరిస్తాయి."

ఇద్దరం బయలుదేరాం. వినత ఇంటిదగ్గరనే వుండిపోయింది. "రమాకాంతబాబు కూడా భోజనానికి ఇక్కడికే వస్తాడు" అని అతడు వినతతో చెప్పాడు. ఆమెతల పంకించింది.

ఒక లోయదగ్గరకు వెళ్ళాం. అతడు ఒక పెద్ద ఓక్ వృక్షాన్ని - కేన్వాస్ గుడ్డపై చిత్రించ నారంభించాడు. నేను కొంచెం దూరంగా పచ్చికపై పడుకొని వొకపుస్తకంతీసి చదవ నారంభించాను. పది పుటలైనా చదివానో లేదో - అవస్థి దగ్గరకువచ్చి "మిత్రమా! కొంచెం విశ్రాంతి అవసరమయింది" అన్నాడు.

ఇద్దరం కళను గురించి - విదేశాలలోని కళావైదగ్ధ్యాన్ని భారతీయచిత్రకళా ప్రాభావాన్ని గురించి తర్కించాం. ప్రాక్పశ్చిమ కళా సంప్రదాయాలలోని భేదాన్ని గురించి తర్జనభర్జనలు జరిపాం. ప్రసిద్ధచిత్రకారులనుగురించి చెప్పుకున్నాం. తరువాత మరో పావుగంట అతడు బొమ్మదగ్గర కూర్చుని "ఇవాళ చిత్రం మీదికి బుద్ధిపోవటం లేదయ్యా" అన్నాడు.

ఇద్దరం తిరిగి ఏవో కబుర్లు మొదలుపెట్టాం. ఎన్నెన్నో విషయాలనుగురించి తనివితీర సంభాషించుకున్నాం. హృదయాలు తృప్తినొందగా - ఉభయులమూ ఇంటికి బయలుదేరాం.

వెళ్ళేటప్పుడు ఏవిధంగావుందో - వచ్చేటప్పటికి కూడా వినత అలానే కిటికీలో కూర్చుని లేసు అల్లిక సాగిస్తూవుంది.

"అమ్మాయి ఇవాళ అలిగింది"అన్నాడు గోవింద్ అవస్థి.

"సత్యాగ్రహం" అన్నాను నేను. అప్పటికీ ఆమెముఖంలో చలనం కనిపించలేదు.

ముగ్గురం భోజనాలుచేశాం. భోజనానంతరం కూడా ఆమె అదేవిధంగావుంది. సాయంకాలం ఆరుగంటలకే తనగదిలోకివెళ్ళి పడుకొని నిద్రపోయింది.

"ఏమిటో చిన్నతనం" అన్నాడు అవస్థి.

నేను ఏడుగంటలకు బయలుదేరి తిరిగి ఇంటికివచ్చాను. నా మనస్సును ఏదో విషాదచ్ఛాయ అలముకున్నట్లు తోచింది. పడుకుని నిద్రపోవడానికిముందు వినతను గురించే యోచించాను.

"చిత్రమైన పిల్లే" అనుకున్నాను.

"ఏమైనా - ఆమె అతనికి చెల్లెలు మాత్రం కాదు అనే భావం ఉన్నట్లుండి మెరుపులాతోచింది.

# 6

ఈవిధంగా ఒకపక్షం రోజులు గడిచిపోయినై. ప్రతి రోజు నేను అవస్థి ఐనతలను చూడడానికి వెళ్ళేవాణ్ణి. ఒకటి రెండుసార్లు నాతో మాట్లాడకుండా తప్పించుకొని పోవడానికి ఆమె యత్నిస్తున్నట్లుగా నాకు వ్యక్తమయింది.

"మొదటి పరిచయమైన రెండుమూడు రోజులలోను చూపిన చనువు నిగ్రహమయింది. నెమ్మదిగా తగ్గించి వేసింది. నన్నుచూసి మనస్సులో ఏదో మథనపడుతున్నట్లుగా తోచింది. ఆమె ప్రవర్తన నాకు వింతగా తోచింది.

ఆమె జర్మన్, ఫ్రెంచి భాషలలో మాట్లాడగలదు. చిన్నప్పుడు అయిదారుభాషలు నేర్చుకొన్నదని అవస్థియే నాకు సంభాషణ వశాన చెప్పాడు. ఆమె విద్య - సంస్కృతి - నడవడి చూడగా తల్లి పోషణలోకంటె ఎక్కువగా తండ్రి పోషణ పర్యవేక్షణలలోనే శిక్షణ పొందివుండాలనిపించింది.

ఆమెను అవస్థికు ఏకోశాన సాదృశ్యంలేదు. కొండకోనలలో - సాంద్రారణ్యాలలో - నదీనదాలదగ్గర స్వేచ్ఛగా తిరిగే వనలక్ష్మిని తెచ్చి ఇంటిలో కట్టివేసి—నవనాగరికతకు అలవాటుచేసి వుంటారా అనే సందేహం కలిగింది.

నేను పెక్కుసార్లు భారతదేశంలోని ఆమె జీవితాన్ని గురించి, ఆమె పుట్టుపూర్వోత్తరాలను గురించి ప్రశ్నించాను. ఆమె నా ప్రశ్నలలో దేనికీ సరిగా సమాధానం చెప్పేదికాదు. చెప్పినా-తన ఇచ్ఛకు విరుద్ధంగా చెబుతున్నట్లే కనిపించేది.

ఒకనాడు నేను వారి ఇంటికి వెళ్ళేసరికి సోఫాపై పడుకొని ఆమె నవల చదువుతున్నది. "సెభాష్! విద్యార్థినీ" అన్నాను.

ఏం అన్నట్లు ప్రశ్నార్థకంగాచూసి లేచికూర్చుంది.

"ఎంతశ్రద్ధగా చదువుతున్నావు?" అన్నాను.

"నవ్వేడంతప్పు నాకు మరేమీ చేతకాదనుకున్నారు కాబోలు" అని వెళ్ళిపోయింది.

"అదికాదు వినతా నేనన్నది. ఆ నవల అంత మంచిది కాదని."

"ఏ నవలా చదవక ఏం చెయ్యను." అని ఆ పుస్తకం టేబుల్ మీద పడవేసి తోటలోకి పరుగెత్తింది.

ఆ సాయంకాలం గురుదేవుడు రవీంద్రుని "నౌకాడుబ్బీ" నవల - బెంగాలీలోనిది చదివి హిందూస్థానిలో అవస్థేకు వివరించి చెబుతూవుండగా ఆమె దగ్గరకువచ్చి శ్రద్ధగా ఆ కథ అంతా వింది.

మరునాడుకూడా ఆమె తొలినాటివలెనే అతి నిరాడంబరంగా దుస్తులు ధరించుకొని వుంది. మెడలో గొలుసుకూడా లేదు. అప్పటికీ అందంగానే — ఆకర్షకంగానే కనిపించింది. ఆమెను చూసినకొలది — ఆమె అతనికి తోబుట్టువు కాదనే విశ్వాసం నాలో ప్రబలంకాసాగింది. అతనికి ఆమెయెడల అభిమానంవుంది. దయవుంది. కాని సోదరునికి—సోదరిపై వుండే అవ్యాజమైన అనురాగం, వాత్సల్యం లోపించింది.

తలవని తలంపుగా జరిగిన ఒకసంఘటన నా అనుమానాన్ని ధ్రువపరిచింది. ఒకనాటి సాయంకాలం నేను వారియింటికి వెళ్ళాను. ముందుగేటు లోపలగడియ వేసివుంది. గొంతెత్తి పిలవడం ఎందుకని నేను—అటు ప్రక్కకు మళ్ళి—ఆట్టే ఎత్తు లేని ప్రహారీగోడను దాటి లోపలకు వెళ్ళాను.

తలుపులు చేరవేయబడి వున్నాయి. గది లోపలినుంచి వినత వెక్కి వెక్కి ఏడుస్తూ ఏవో మాటలు అంటున్నది. గది కిటికీ దగ్గరగా వెళ్ళాను.

"లేదు...నేనెవర్నీ ప్రేమించడం లేదు...ఎవరినీ ప్రేమించాలని అనుకోవడం లేదుకూడా. నిన్నే ప్రేమిస్తున్నాను. నిన్నుతప్ప మరెవరినీ ప్రేమించను...నా మాటనమ్మే" అని ఆమె ఏడుస్తూవుంది.

ఒక్కసారి తలపైకెత్తి చూశాను. ఆమె అతని అక్కున చేరివుంది. అతడు ఆమెవీపు నిమురుతూ "చాలు. ఏడవకు. నేను నీమాటలను నమ్మతున్నాను. ఇక ఏడవకు" అని బుజ్జగిస్తున్నాడు.

ఒక్క క్షణంపాటు నిశ్చేష్టుడనై అలానే వుండిపోయాను! లోపలికి వెళ్ళనా మాననా అని సంకోచించాను. లోపలికి వెళ్ళడానికి మనస్కరించలేదు. "పోదాం! ప్రపంచం తలక్రిందయ్యేది వీరితో నాకిక పనిలేదు" అనుకున్నాను. మెల్లగా వచ్చినదారినే ప్రహారీగోడ దగ్గరకు వెళ్ళి, బయటకు దూకి విసవిస నడుస్తూ ఇంటికి చేరుకున్నా.

"ఎలా నటించాలో ఇద్దరికీ బాగా తెలుసు. అయితే నటించవలసిన పనేమిటి ? నన్ను వంచించడంవల్ల వారికి కలిగే ప్రయోజనం ఏమిటి?......అయ్యయ్యో......ఏమిటి ఈ వైచిత్ర్యం?......

# 7

ఆ రాత్రినాకు చాలసేపటిదాకా నిద్రపట్టలేదు. నిద్ర పట్టిన గంట రెండుగంటలలోను ఏవో పీడకలలు వచ్చాయి. ఉదయం పెందలాడే లేచాను. వంటావిడతో ఆ వేళ, మరునాడు కూడా ఇంటికి రానని చెప్పి, తిన్నగా షూక్ బర్గ్‌కు వెళ్ళాను.

ఒక హోటల్‌లో భోజనంచేశాను. నదీతీరానికి వచ్చి ఒక చెట్టునీడను నిద్రపోయాను. సాయంకాలం పట్టణాం వెలు పలవున్న మైదానంలో - పర్వత ప్రాంతాలలో - నదీతీరంలో తిరుగుతూ ప్రొద్దుపోయేదాకా గడిపాను. రాత్రి మరొక హోటల్‌లో భోజనం చేశాను.

హోటల్ యజమానులతో- ప్రజలతో - బాలబాలి కలతో ఒక లక్ష్యం లేకుండా ఇష్టంవచ్చినట్లు ఏవేవో మాట్లా డుతూ- ప్రకృతి శోభను, పర్వతశిఖరాల గాంభీర్యాన్ని, విధి విరామాలు లేకుండా ప్రవహించే రైన్‌నదిని, కిలకిలారావా లతో ఒళ్లు ఝల్లుమనిపించే శకుంత సందోహాల్ని చూస్తూ, నిసర్గోత్సాహం పొందేవాణ్ణి.

చాలాసార్లు అవస్థేను, వినతను తలపునకు రాకుండా చేద్దామని యత్నించాను. నన్ను యెందుకు మోసగించాలా అని బాధపడ్డాను. ఇక తిరిగి ఆ గుమ్మం తొక్కకూడదనే నిర్ణయించుకొన్నాను. వినతను మరచిపోయి జర్మన్ వితంతువును గురించి యోచించడానికి నేనుచేసిన యత్నం విఫలమైంది.

హూంబర్గు పరిసరాలలోని గ్రామాలకుకూడా వెళ్లాను. మూడు రోజులలోను ఒక్కొకసారి హృదయం వికలమైనప్పటికీ మొత్తంమీద కులాసాగానే గడిచిపోయింది. ఒక్క నిమిషమైనా వ్యర్థపుచ్చడానికి ఇష్టపడని జర్మన్ యువతీ యువకులను, ఆ చిన్నచిన్న గ్రామాలను, ఇప్పటికీ తలచుకొన్నపుడు శరీరం ఆనందపులకితం అవుతూ వుంటుంది.

నాలుగవరోజు ఉదయంతిరిగి ఇంటికిరాగానే నాగదిలో ఒకఉత్తరం పడివుంది. అది అవస్థే వ్రాసిందే. నేను చెప్పకుండా వెళ్ళిపోవడం తనకు చాలాకష్టం కలిగించిందనీ, తిరిగి రాగానే తప్పకుండా తమదగ్గరకు రావలసిందనీ బ్రతిమాలాడు. ఆ ఉత్తరం నాకు అంతఉల్లాసం కలిగించలేదు. కాని మరునాటి ఉదయం క్రెఫీల్డుకు వెళ్ళాను.

# 8

అవస్థే ఎంతో ఆప్యాయనంగా మాట్లాడాడు. చెప్ప కుండా వెళ్ళానని మధనపడ్డాడు. స్నేహానికి విరుద్ధంగా వర్తిం చానంటూ నిష్ఠూరం వేశాడు.

ఇక వినత మళ్ళా నవ్వులు —పరుగులు— ఉరుకులు మొదలుపెట్టింది. ఈ తెచ్చిపెట్టుకున్న నవ్వులధోరణి నాకు నిజంగా చికాకు కలిగించింది.

ఒక గంటసేపు కూర్చుని, యింటిదగ్గర పనివుందని లేచాను. ఆపూటకు అక్కడవుండి పొమ్మని అతడు బలవంతం చేశాడు. కాని నాకళ్ళలో నిశ్చితాభిప్రాయాన్ని గమనించి తానుకూడా వస్తానని లేచాడు.

ఆమెవచ్చి కరస్పర్శకై తనచేతిని ముందుకు చాపింది నేను కొంత ఆశ్చర్యంపొంది, నాచేతిని ముందుకు చాచి కరస్పర్శకు పిమ్మట అవస్థేతో కలిసి బయలుదేరాను. ఇద్దరం ఇంటికివెళ్ళగానే కాఫీత్రాగి, సిగరెట్ అంటించి, ఇంటినానుకొని వున్నతోటలో ఒకచెట్టుక్రింద శిలాఖండంపై కూర్చున్నాం.

రెండు నిముషాల పాటు ఉభయులమూ కూడా మౌనంగావున్న పిదప, అతడుఅకస్మాత్తుగా "రమాకాంతబాబూ, వినతను గురించి మీ అభిప్రాయం ఏమిటి? ఆమె ప్రవర్తన మీకు ఆశ్చర్యం కలిగించలేదా?" అని అడిగాడు.

"కలిగించింది" అన్నాను.

అతడు వినతప్రసక్తి తెస్తాడని నేను అనుకోలేదు.

"ఆమెనుగురించి ఏ నిర్ణయాన్ని అయినా చెయ్యడానికి పూర్వం ఆమెస్వభావాన్ని పూర్తిగా గ్రహించడం అవసరం. ఆమె హృదయం అమృతమధురం. అయితే బహు మంకుపట్టు గలది. ఆమెతో వ్యవహరించడం కష్టసాధ్యమైన విషయం. అయితే ఒకమాట. ఆమెకథ విన్నతర్వాత ఈ మంకుపట్టుకు ఆమెను మీరు నెపపెట్టరు."

"ఆమెకథా?ఆమె మీచెల్లెలుకాదా?"అని అడిగాను నేను.

"మీరు బహుశా ఆమె నాచెల్లెలు కాదని అనుకుంటున్నారు కాబోలు. నిజంగాఆమె నాకుచెల్లెలే. అయితే వినండి. ఆమెసంగతి పూర్తిగా చెబుతాను. మనఇద్దరి హృదయాలు కలిసిపోయినపుడు ఈవిషయంచెబితే నాహృదయ భారమైనా కొంత తగ్గుతుంది.

"నాతండ్రి బాగా చదువుకొన్నాడు. భాగ్యవంతుడు.

"అయితేనేమి సుఖజీవనానికి నోచుకోలేదు. నా తల్లిని తన ముప్పైఎయ్యవ ఏటనే పెళ్ళిచేసుకొన్నాడు. ఆమె వివాహమైన తర్వాత నాలుగైదేళ్లు మాత్రమే జీవించి నన్నుకని మరణించింది. ఆమె కాలధర్మం పొందేసరికి నాకు ఆర్నెల్లుకూడా నిండలేదట. భార్య పోవడంతో ఆయన మనస్సు పూర్తిగా వ్యాకులితమై పోయింది. నన్ను ఆయన మా స్వగ్రామానికి తీసుకుపోయారు. ఇకమరొక వ్యాపృత్తిలేదు నన్ను పెంచడం-చదువు చెప్పించడం తప్ప.

"నాకు పన్నెండేళ్ళ ప్రాయంవరకు ఆయనే చదువు చెబుతూ వచ్చారు. నా పినతండ్రి, లాహోర్‌లో పెద్ద ఉద్యోగం చేస్తూవుండేవాడు. నేను పల్లెటూళ్ళో— నాయన చెప్పే చదువుతోనే కాలం గడపవలసివస్తే తప్పకుండా శుంఠ నయిపోతాననీ, తనతో పంపిస్తే హైస్కూల్‌లోను, ఆతర్వాత కాలేజీలోను చదివించి, పైకితీసుకు వస్తానని చెప్పి, ఎలాగైతేనేం ఒప్పించి తీసుకుపోయాడు.

"గుల్బర్గానుంచి ఎప్పుడైతే నేను లాహోరు వెళ్ళానో- నిరుత్సాహ నిరాశా మయమైన జీవితం వదిలిపోయింది. స్కూలులో చేరాను. సంవత్సరానికి ఒకసారి గుల్బర్గావెళ్ళి రెండునెల్లు నాయనదగ్గరవుండి వచ్చేవాణ్ణి.

"ఈవిధంగా కొన్ని సంవత్సరాలు గడిచిపోయినవి. స్కూలులో విద్యాభ్యాసం ముగించి నేను కాలేజీలో చేరాను.

"ఒక సంవత్సరం ఇంటికి వెళ్ళేసరికి ఇంటిలో ఒకపదేళ్ళ పిల్ల కనిపించింది. ఆ పిల్లేవినత. దిక్కూ మొక్కూ లేని ఆ పిల్లను తాను పెంచుతున్నానని మానాయన నాతో చెప్పాడు. నిజమే అనుకున్నాను. అప్పట్లో వినత నేను కనిపించేసరికి ఎం దుకో చాటుగా వెళ్ళిపోతూవుండేది. మా తండ్రిగారి గదిలోకి పనిమీాద నేను వెళ్ళినపుడల్లా వినత బీరువావెనక దాగొనేది.

"బి. ఏ. ప్యాసయిన తర్వాత నేను సైన్యంలో ఉద్యోగిగా చేరాను. చేరి మూడునాలుగు సంవత్సరాలవరకు స్వస్థానానికి వెళ్ళలేకపోయాను."

"ప్రతినెలా నాన్నగారు ఒకవుత్తరం వ్రాస్తూనే వుండే వారు. కాని వినతను గురించి ఎప్పుడూ ఏమీ తెలియజేసే వారుకారు.

"ఆయనకు యాభై ఏళ్ళు నిండాయి. కాని నలభై ఏళ్ళు కూడా దాటనివానివలె దృఢంగా వుండేవారు. ఉన్నట్లుండి ఒకనాడు టెలిగ్రాం వచ్చింది. ఆయన మరణశయ్యపై వున్నా డని, వెంటనే రమ్మని. నా ఆందోళనకు అంతులేక పోయింది. వెంటనే పదిహేనురోజులు సెలవుపెట్టి, గుల్బర్గా వెళ్ళాను.

"నేను వెళ్లేసరికి ఆయన ఇంకా జీవించే ఇప్పుడో— ఇకనో అంటూవున్నారు. నన్ను దగ్గరకూర్చోమని ఒక్కసారి నా కళ్ళలోకి సాలోచనగా చూసి నౌకరును పిలిచి వినతను తీసుకు రమ్మన్నారు.

నౌకరు బాజీ ఎన్నాళ్ళనుంచో మా ఇంట వున్నాడు. బాజీ ఆమెను తీసుకువచ్చాడు. అప్పటికి ఆమెకు పధ్నాలుగో యేడు.

ఆమెచేతిని నాచేతిలోపెట్టి నాన్నగారు "గోవింద్! ఈ పిల్ల నాకూతురు. నీచెల్లెలు. నీచేతిలో పెట్టాను. ఈ పిల్లను కాపాడే బాధ్యత నీది" అన్నారు.

"ఆయన కళ్లు దుఃఖాశ్రువులతో నిండిపోయాయి. ఆ తర్వాత ఆయాసం హెచ్చింది. ప్రాణాలు విడిచారు. వినత బోరుమని ఏడ్చింది.

"బాజీ తర్వాత నాతో జరిగినదంతా చెప్పాడు. మా ఇంటిలోనే మా అమ్మ బ్రతికినప్పట్లో కూడా లోకేశ్వరి అని

పరిచారిక వుండేది. మా అమ్మ పోయినతర్వాత నన్ను లోకేశ్వరే పెంచింది. ఆమె రూపసి, నా తల్లి మరణించిన ఏడాదికే నాన్నగారికి లోకేశ్వరితో మైత్రి ఏర్పడిందట.

లోకేశ్వరి నా చిన్నతనంలో కూడా మా ఇంటిలో వుండేదికాదు. ఎక్కడో వేరే ఒక చిన్న పూరింట కాపరం వుండేది. నా తండ్రి ఆమెను పెళ్ళిచేసుకొనడానికి కూడా సిద్ధపడ్డాడు. అయితే కులంలో-హోదాలో - తనకూ, నాయనకూ హస్తిమశకాంతరం వుందని, ఆమె అందుకు సమ్మతించలేదని బాజీ చెప్పాడు.

నాన్నగారు ఒకసారి పెళ్ళిప్రస్తావన తెచ్చినపుడు ఆమె "విరుద్ధం. మీరెక్కడ? నేనెక్కడ? ఇదేంసిగ్గుచేటుపని" అని అనగా విన్నాననికూడా బాజీ అన్నాడు.

"మా పినతండ్రి నన్ను తనతోకూడా లాహోరు తీసుకు వెళ్ళినప్పటికి వినత వయస్సు రెండేళ్ళు. లోకేశ్వరి మృతినొందే సరికి తొమ్మిదేళ్లు. నాన్నగారు కాలంచేసేసరికి పధ్నాలుగేళ్లు. పధ్నాలుగేళ్ళ పిల్లని ఒకటి రెణ్ణెలల్రక్రితమే ఈడేరిన పిల్లని ఏం చెయ్యాలో - ఎక్కడకు తీసుకువెళ్ళాలో నాకు బోధపడలేదు.

"తల్లి మృత్యువువాతపడగానే మానాన్నగారు వినతను తన ఇంటిలోకి రప్పించారు. సిల్కు ఉడుపులు తెచ్చి ధరింపజేశారు. దగ్గరకుతీసుకొని బుజ్జగించారు.

"అప్పటినుంచీ ఆయనే ఆమెకుగురువు. ఆమెఅడిగిందల్లా వచ్చిపడేది. ఆ పిల్లను చూసినపుడల్లా ఆయన తాను ఏదో ఘోర తప్పిందం ఒనరించినట్లుగా బాధపడేవారట.

"ఆయన ఎంతగారాబంగా చూసినప్పటికీ ఎంతగాఢంగా ప్రేమించి ఆదరించినప్పటికీ తన జన్మరహస్యం ఆమెకు తెలుసు. నాతో ఒకసారి వినతే చెప్పింది. తన పుట్టుకను గురించిన వృత్తాంతాన్ని ప్రపంచమంతా మరిచిపోయేటట్లు చేద్దామను కుందట. సిగ్గుపడడం సిగ్గుమాలినపని అనుకొన్నదట కూడా.

"ఆమె ఈడుకుతగని తెలివితేటలూ, సంస్కృతీ ఆమెకు అలవడ్డాయి. నాన్నగారు ఆమెకు బాల్యంలోనే ఫ్రెంచి, జర్మన్, ఆంగ్లభాషలను నేర్పించారు.

"నాన్నగారు పోయినతర్వాత ఆ ఇంటిలో నా కంఠ స్వరం వింటే—నేను పిలిస్తే—తుదకు నేను కనిపిస్తే ఆమె గజగజ వణికిపోయేది. నేను మెల్లగా దగ్గరకు చేరదీసి—నా సోదరిగా భావించి, ప్రేమిస్తానని నచ్చచెప్పేవరకుకూడా ఆమె నాతో చనువుగా మెలగేదికాదు.

"ఆమెను నాతో లాహోరు తీసుకుపోయి బాలికా పాఠశాలలో చేర్చాను. హాస్టల్‌లోనే ఆమెవుండడానికి ఏర్పా టుచేశాను. నన్నువదలిపెట్టి హాస్టలోవుండి చదువుకోలేనని ఆమెఏడ్చింది. కాని నేనేమిచెయ్యను? చేస్తున్నది సైనికో ద్యోగం, బస సైనికశిబిరంలో.

"నన్నువదలిపెట్టి వేరేవుండవలసి రావడంతో ఆమె బెంగపెట్టుకొని, జబ్బుపడింది. ఎలాగైతేనేం నాలుగేళ్ళపాటు స్కూలులోవుండి చదువుకొంది. నేను లాహోర్‌నుంచి వేర్వేరుచోట్లకు ఉద్యోగధర్మాన వెళ్ళవలసివచ్చింది. అయి

నప్పటికీ ఆమెకు తరుచుగా వుత్తరాలు వ్రాసి. డబ్బు పంపిస్తూ వుండేవాణ్ణి.

"ఆస్కూలులో ఆమెచదువు పూర్తిఅయింది. సర్వీస్‌నుంచి నేను విడుదలపొందాను. ఇక ఆమె భావినిగురించి యోచించ డంతో కర్తవ్యం నిర్ణయించలేక, ఒకటిరెండేళ్ళు విదేశపర్యటన చేయడం యుక్తమనుకొని బయలుదేరాను. అదే మా యీ ప్రయాణానికి కారణం. ఇదీ మా వృత్తాంతం.

"ఆమెస్వభావం బహు విచిత్రమైనది. ఒకసారినవ్వుతూ, ప్రపంచంతో తనకేమీ నిమిత్తంలేనట్లు ఎంతోసరదాగా— ఉత్సాహంగావుంటుంది. ఒక్కొకసారి లేనిపోని యోచనతో మనస్సు పాడుచేసుకొని, రోజంతా ఏడుస్తూ కూర్చుంటుంది.

ఇప్పుడు వినతకు పద్ధెనిమిదేళ్లు. హృదయం నవయావ నోత్సాహభరితమైన సమయం—తుపానువలె భీషణమైన ప్రకృతిగల ఈమె నెవరు ప్రేమిస్తారో—ఈమెకు ఎవరు నచ్చు తారో తెలియదు. ఒకవేళ ఈమె ఎవరినైనా ప్రేమించటమే సంభవిస్తే కొంపమునిగిందన్నమాటే. ఒక్కొకసారి ఈమె మాటలు చేష్టలుకూడా నాకే విభ్రాంతికలిగిస్తాయి. మూడు రోజులక్రితం ఏంచేసిందో తెలుసా ?

"నేను ఇదివరలోవలె తన్ను ప్రేమించి ఆదరించక, వెరుసుగా చూస్తున్నానని అక్కునజేరి నన్నే ప్రేమిస్తానని, ఇంకెవరినీ ప్రేమించననీ ఏడవసాగింది. అసలు ప్రేమఅంటే ఈమె ఏవిధంగా అర్థంచేసుకుందోకూడా తెలియదు."

"ఓహో! అదా సంగతి?" అని నేను నాలుక కరుచుకొన్నాను.

'అయితే మిత్రమా! లాహోర్‌లో ఈమె ఎవరినీ ప్రేమించలేదా? ప్రేమించడానికి అవకాశమైనా కలగలేదా?"

"లేదు. అసలు అవకాశమే లేదు. అక్కడవున్న నాలుగేళ్లు హాస్టల్‌లోనేవుంది. ఆమె అంతసులభంగా ఎవర్నీ ప్రేమించదు. ఎవరి ప్రకృతిలోనైనా ఏదో వొకవిశేషంవుంటేనేగాని వనితకు నచ్చరని నా మతం. సరే నేనువచ్చి చాలాసేపయింది. మీరు ఏదో పనివుందన్నారు కూడా ఇక వెడతాను." అని అవస్థీ లేవగా "కేను మరేం పెద్దపని లేదు. నడవండి. మీతో కూడా వస్తాను అన్నాను."

ఇద్దరమూ తిరిగి నదినిదాటి వారిఇంటికి వెళ్ళాం. ఆ ఇంటిగుమ్మంలో అడుగుపెట్టగానే నా హృదయం ఏదో చెప్పరాని ఆనందంతో వివశమయిపోయింది. ప్రణయసుధను నా మనసుపై ఎవరో చిలికినట్లయింది. అవస్థి కథవిన్నతరవాత హృదయంనుంచి పెద్దబరువు తొలగిపోయినట్లయింది.

# 9

హాలులోనే మాకు వినత కనిపించింది. ఆమె నన్ను చూసి యథాప్రకారంగా నవ్వుతుందనుకున్న నాకు కొంత ఆశాభంగమే కలిగింది. ఆమెముఖం వెల్లనై వుంది. ఒక సారి నావంక చూసి, ఆతర్వాత తలవంచుకొంది.

"ఇదిగో! వినతాదేవీ! శ్రీ రమాకాంతబోసు మహాశయుడు నేను రమ్మనగా రాలేదని గ్రహించుము. అతడు తనకు తానై విచ్చేసె" నన్నాడు అవస్థీ చమత్కారంగా.

అప్పటికీ ఆమె ముఖంలో మందహాసమైనా తోచలేదు. నేనుగ్రహించాను. ఆమె ఏదోదారుణమైన ఆవేదన ననుభవిస్తున్నదని. పైకి నవ్వినా అదంతా కపట నాటకమేనని ఆమె చిత్తాన్ని దహిస్తున్నదేమై వుండగలదాఅని యోచించాను.

ఆవయస్సు మహాసంధిగ్ధమైనది. ఆమె చిత్తములోఏదో విపరీతమయిన సంఘర్షణ సాగుతూ వుండాలని, అది ప్రేమకు సంబంధించినదే అయివుండ వచ్చునని నాకుతట్టింది. ఆమెఆత్మ ఏదో సత్యాన్వేషణకై తహతహ పడుతున్నట్లుగా నాకు పొడగట్టిందికూడా.

అపూర్వమైన ఆమె బాహ్యసౌందర్యం మాత్రమే గాక సుస్నిగ్ధమైన ఆమె ఆత్మసౌందర్యం కూడా నాహృదయాన్ని ఆకర్షించింది — ఆనందోత్తేజితం చేసింది.

అవస్థే తన చిత్రరచనలో నిమగ్నుడుకాగా నేను విన తనుచూసి "ఒకసారి మనం తోటలో తిరుగుదాం వస్తావా ?" అనిఅటిగాను. ఆమె వెంటనే అంగీకరించింది. నేను తోటలో తిరుగుదాం అని అనగానే నైరాశ్యాన్ని ప్రతిఫలిస్తున్న ఆమె నేత్రాలు సంతోషంతో ఉజ్వలమైనాయి.

ఇద్దరం క్రిందికిదిగి గేటుకు దగ్గరగావున్న ద్రాక్షపందిరి క్రింద కూర్చున్నాం.

"మమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళిపోయి మూడురోజులదాకా కనిపించారుకాదే. మీకు ఆమూడురోజులు తోచిందా?" అని అడిగింది.

"నేనురాకపోతే మీకు తోచిందా?" అని నేనడిగాను.

"తోచలేదు. మీరు డూమ్‌బర్గ్ వెళ్లామన్నారు కదూ? అక్కడ ఏంచూశారో చెప్పండి. మీరు ఆమూడు రోజుల విశేషాలు మాఅన్నతో చెప్పినపుడు నేనుసరిగా వినలేదు."

"వినకుండా మరి ఎందుకు వెళ్ళిపోయావు ?"

"ఎందుకా...మరేం......సరే ఇప్పుడు వెళ్ళనులెండి, చెప్పండి. కాని ఒక్కమాటఅంటాను మీకు కోపంరాదుగదా"

రాదు, చెప్పు."

"మీరు అలా చెప్పకుండా వెళ్ళిపోయినందుకు నాకు ఎంతకోపం—ఎంత ఏడుపువచ్చాయో ? మీరు తిరిగిరావడం వల్ల ఎంతో సంతోషంకలిగింది."

నాకుకూడా తిరిగివచ్చి నిన్నుచూడ్డం ఎంతో సంతో కలిగించింది."

రైన్‌నదిలో అదేసమయాన ఒక స్టీమరు రంయ్‌మంటూ పొగను వెలిజిమ్ముతూ వెళ్ళింది.

"ఏవైనా కబుర్లు చెప్పండి వింటాను."

"చెబుతాను. కాని ఇవాళ ఉదయంరాగానే ఎందుకు నవ్వావో చెప్పవూ ?"

"ఎందుకా ? ఏమో నవ్వాలనిపించింది. నవ్వాను ఒక్కొక్కసారి ఏడవాలనిపిస్తుంది. అప్పుడు కూడా ఎందుకో నవ్వే వస్తుందిమరి."

ఇంతలో ఎవరో యాత్రికులు ఏవోపాటలుపాడుకుంటూ దూరాన రోడ్డుపై నడిచిపోతున్నారు. ఆ పాటలు విని "మనం కూడా వారితోపాటు పోతేనా ?" అంది.

"ఏం ? ఎక్కడెక్కడికో వెళ్ళాలని—ఏవో ఘనకార్యా లుచేసి, కీర్తి పొందాలని నీకు కోరికవుందా ?

"ఉంది. అయితే అలాంటి కోరికలు నెరవేరడం సంభవమా ?"

"ఎందుకు కాదు ? ప్రయత్నిస్తే సరి."

ఒకనిమిషం ఆగి "మరేం ! ఒకమాట అడగనా?" అంది.

నేను తల పరికించాను.

ఆవేళ శిథిలదుర్గాన్ని చూడడానికి వెళ్ళినపుడు మా అన్న మీరు బీరు త్రాగేరేం జ్ఞాపకంవుందా. అప్పుడు మా

అన్న మీ ప్రియురాలి ఆరోగ్యంకోసం అన్నాడుకదూ. ఆ ప్రియురాలు బాగా అందమైనదేనా ?"

"అందమైనదేకాని నీకంటె ఎక్కువ అందమైనదికాదు."

"ఆమెను మీరు గాఢంగా ప్రేమించారా ?"

"లేదు. ఇంతవరకూ నేను ఎవర్నీ గాఢంగా ప్రేమించ లేదు. మీ అన్న ఆనాడు అలాఅన్నది పరిహాసానికే."

"స్త్రీల ప్రకృతిలో మీ చిత్తాల్ని ఆకర్షించే విశేషం ఏమిటి ?" అని ఆమె ప్రశ్నించింది మళ్ళీ.

"ఏమిటీ విచిత్రప్రశ్న" అనుకున్నాను.

"క్షమించండి చాలా తెలివితక్కువగా మాట్లాడాను. నా దగ్గరవున్న జబ్బేఇది. నోటికివచ్చిందేదైనా సరే అనేస్తాను ఆలోచించకుండా."

"అను అదేమంచిది. నువ్వీ ఈ నాటికైనా బిడియం లేకుండా నాతో మాట్లాడడానికి సిద్ధపడ్డావు సంతోషం."

ఆమె మెల్లగానవ్వింది. ఆలానవ్వడం నేను అంతకుముం దెప్పుడూ గమనించలేదు.

"ఏమోగాని ప్రపంచాన్ని చూస్తే నాకే ఒక్కొక్క పుడు విసుగు, విరక్తి కలుగుతాయి. ఏదైనా కథచెప్పండి పోనీ ఇంతేనాఏమిటి? ఎన్నిసార్లు అడగాలి. ఆవేళ గురుదేవుని 'నాకా భంగం' కథచెప్పారు ఎంతబాగుంది అలాంటిదే."

"నాకు ఈ రమణీయమైన ప్రకృతిశోభను, అంతకంటె మహిమాన్వితంగా కనబడే నిన్ను చూస్తువుంటే—ఏ కథా

జ్ఞాపకం రావడంలేదు. చూడు. ఆ ఆకాశం—ఈతోట. దూరాన ప్రవహిస్తున్న నది—ఇంకా దూరంగా ఎండలో వెండి కొండల్లా మెరుస్తున్న పర్వతాలు ఇవన్నీ ఎంత అందంగా ఆనందోజ్వలంగా వున్నాయో?"

"నిజం. మరి మనకే దేవతల్లా రెక్కలుంటేనా? ఆకాశానికి ఎగిరిపోయి పక్షులతో పాటు మనంగూడా ఏవేవో పాటలు పాడుకుంటూ వాయుతరంగాల్లో లీనమైపోయే వాళ్ళం. మరుక్షణంలో క్రిందకుదిగి సముద్రజలంలో ఈదుకుంటూ పోయే వాళ్ళం. మనం పక్షులమైనా కాకపోయాం కదా."

"కాకపోవచ్చు. కానీ రెక్కలు మాత్రం కల్పించుకోవచ్చు."

"వట్టిమాట. మానవులకు రెక్క లెక్కణ్ణుంచి వస్తాయి స్వామీ"

"వస్తాయి శిష్యురాలా—వస్తాయి. కొంతకాలం గడవనీ. హృదయం పరిణతిపొందనీ, మానవులకు అతీతమైన భావాలను పెంపొందించు కొన్ననాడు—లక్ష్యాలను సాధించిననాడు—సిద్ధాంతాలను అనుష్ఠించిననాడు మనం అమరులం కాగలం"

"మీరు ఆపరిస్థితిని పొందడానికి సాధనచేశారా"?

లేదు. నా మనస్సుకూడా ఇంకా అంతపరిణతి పొందలేదు. ఇంకాసాధనే ప్రారంభించ లేదేమో కూడా."

"మీకు సంగీతం వచ్చా?"

"కొంచెంగా."

"అయితే రండి. ఇంటికి పోదాం. రెండుపాటలు పాడు దురుగాని." అంటూ వినత పరుగెత్తింది. నేనుకూడా వెళ్ళాను. ఆమెకోరికను నిరాకరించలేక రెండుపాటలు పాడాను. ఆమె ఎంతో ఉత్సాహంతో విన్నది. ఆనందపారవశ్యాన అరమోడ్పు కన్నులతో నావంక ఆమె చూసినపుడు నేను కలకంటున్నానా అని అనిపించింది.

# 10

ఆ రోజంతా బహుకులాసాగా గడిచిపోయింది. చిన్న పిల్లలవలె నేనూ అవస్థే, వినతాకూడా సరదాగా ఏమేమో కథలు, కబుర్లు చెప్పుకుంటూ—కాసేపుచీట్లాట-కొంతసేపు చదరంగం—మరికొంతసేపు సంగీతం ఇలాగే ఎంత ఆనందంగానో గడిపాం. నేను పాడాను కనక ఆమెను పాడమని పట్టుపట్టాను. ఆమె అంత ఉల్లాసంగావుండడం చూసిన అవస్థే ముఖంలో సంతృప్తి తాండవించింది.

నేను వారిఇంటినుంచి రాత్రి తొమ్మిదిన్నర గంటలకు బయలుదేరాను. నన్ను ఆవలిగట్టున దింపి తాము తిరిగి వెళ్ళి పోతామంది వినత. నావ నదీమధ్యానికి వెళ్ళగానే— అద్దరికి గాక దిగువకు పోనిమ్మన్నాను.

చల్లనిగాలికి ఆమె ముంగురులు - చీరచెరగు చెదరి పోతూవుంటే - వెన్నెలకాంతిలో ఆ కాటుకకళ్ళు ఏవో ఆశా మయములైన అవ్యక్తభావాలను వెలిబుచ్చుతూ వుంటే నాకు

అనంతసౌఖ్యం కలిగించింది. ఆ సౌఖ్యంలో ఏమో అపూర్వమైన ఆంనోళన ఆవేదనాను. పైన నక్షత్రాలు — ప్రక్కలను నది. దూరాన చెట్లు — ఇవి అన్నీ నాకంటికి వణకిపోతున్నట్లుగా తోచింది.

గట్టుమీద ఏదో ఒకపక్షి కూ అని కూస్తూవుంటే—నా మనస్సు ఉద్రిక్తమై పోయింది. ఒళ్ళు పులకరించింది. కళ్ళు బాష్పాకులములైనాయి. ఆత్మవినూతన చైతన్యం పొందినట్ల యింది. ఎదసుఖాన్ని ఆనందానుభవాన్ని కోరింది. ఏదో తీరని ఆవేదన—ఎందుకో—ఎవరికోసమో......

# 11

మరుసటి ఉదయం క్రెకేఫీల్డ్‌కు బయలుదేరి వెడుతూ నేను వినతను ప్రేమించానాఅని ప్రశ్నించుకోలేదు. గాని ఆమెనుగురించే చాలాసేపు ఆలోచించాను. ఆమె భావిని గురించి తాపత్రయపడ్డాను. తలవనితలంపుగా ఆమెతో కలిగిన పరిచయానికి ఎంతో సంబరపడ్డాను. రెండు రోజులనుంచే ఆమె నాతో చనువుగా మెలగుతూవుంది. అంతవరకూ ఆమె ఒక్కర్తీ నాతో మాట్లాడినదేది ?

నాతో సరిగా మాట్లాడ నారంభించిన తర్వాతనే ఆమె సౌందర్యంలోని ఆధిక్యాన్ని, ఆమె ఆత్మ ఔన్నత్యాన్ని, ఆమె హృదయంలోని ఔదార్యాన్ని నేను గ్రహించగలిగాను.

గుట్టపైకి ఎక్కుతూవుంటే నాకు భావికాలాన్ని గురించి గాని తుదకు మరునాడు—మరుక్షణాన్ని గురించిగాని, ఆందోళనకలగలేదు. నాకుఎంతో సుఖంగావుంది.

నన్ను చూడగానే వినత బుగ్గలు ఎర్రవారినవి. ఆమె ఎంతో చక్కగా అలంకరించుకొని వుంది. అయితే సంతోషంగా లేదు. విచారం ఆమెకళ్ళలో స్పష్టంగా కనిపిస్తూవుంది. అవష్టి చిత్రలేఖనంలో మునిగివున్నాడు. నన్నుచూసి ఒక్కసారి తల పంకించాడు. తన ఎదటవున్న కేన్వాస్‌గుడ్డపై ఎన్ని రంగులున్నాయో, ఆ రంగులన్నీ అతనిదుస్తులపైన కనిపిస్తున్నాయి. ఒకసారి అర్థనిమీలితనేత్రుడై నావైపు—ఒకసారి వినతవైపు చూసి—మళ్లా తదేకదీక్షతో చిత్రరచనసాగిస్తున్న అవష్టితో సంభాషించి అతని కళాప్రియత్వానికి భంగంకలిగించడం సముచితంకాదని తలపోసి వినతదగ్గరకువెళ్ళి కూర్చున్నాను.

ఆమె నావంక జాలిగా చూసింది.

"నిన్నటిమల్లే ఇవాళ నవ్వటంలేదు నువ్వు" అన్నాను.

"నిజమే. ఇవాళ నామనస్సేమీ బాగాలేదు. రాత్రినిద్ర పట్టలేదు. ఏదోఆలోచనతోనే సరిపోయింది" అందివినత.

"దేన్నిగురించోయ్ ఆ ఆలోచనలు?" అనిఅడిగాను.

"ఎన్నివిషయాలనో గురించి. చిన్నప్పుడు మా అమ్మ బ్రతికివున్న రోజులలోకూడా ఒక్కరైనూ కూర్చుని లేనిపోని ఆలోచనలతో తలనొప్పి తెచ్చుకొనే దాన్ని. తనకు ఉత్తర క్షణంలో సంభవించగల దానినిగురించి మానవులు ఎందుకు

ఊహించుకోలేరో! ఎందుకు కొన్ని సమయాలలో కష్టాలు సంప్రాప్తిస్తాయి? ఎందుకు ఒక్కొక్కసారి ఎవరైనా అడిగినపుడు మనకు తెలిసినదంతా నిజం చెప్పివేయడానికి బుద్ధిపుట్టదు? నాకీ ప్రశ్నలకు సమాధానంరాదేం? నేనేమీ చదువుకోకపోవడం వల్లనేమో—సమాధానాలు స్ఫురించక పోతున్నది. నాకు మానాయన విద్యాబోధన సరిగాచెయ్యలేదు. నేను బొమ్మలు వెయ్యలేను. ఫిడేలు వాయించలేను; చక్కగా గొంతెత్తి పాడ లేను. నాలో ఏగొప్పా ఏవిశేషమూ లేదు. ఎవరికయినా నాతో మాట్లాడితేనే తలనొప్పి రావచ్చు" అని ఏమేమో తలపోసే దాన్ని రమాకాంత బాబూ; ఆడదానికి చదువు అవసర మంటారా?"

"అవసరమే అంటాను. నువ్వు అసమర్థురాలినని అను కోరాదు. నువ్వు బాగా చదువుకొన్నావు. విద్య, విజ్ఞానం, సంస్కృతి నీకు కావలసినంత వున్నాయి."

"పోనీ ఇంకాఏమైనా నేను చదవవలసివుంటే చెప్పండి. మీరేం చదవమంటే అదిచదువుతాను. ఏం చెయ్యమంటే అది చేస్తాను."

ఆ అమాయకత్వాన్ని చూసి-ఆమె చేతిని పట్టుకుని"నీతో మాటాడితే ఎవరికీ తలనొప్పిరాదు. సంతోషమేకలుగుతుంది" అన్నాడు.

"రమాకాంత బాబూ! ఇలారండి. వచ్చిచూడండి. ఈ బ్యాక్‌గ్రౌండ్ బాగుందోలేదో'' అని అవపే.అనగా నేను లేచి అతనిదగ్గరకు వెళ్ళాను. వినత తనగదిలోకి వెళ్ళిపోయింది.

# 12

మరోగంట గడచినతర్వాత ఆమె హాలులోకి వచ్చి, నన్ను తనదగ్గరకు రమ్మనిపిలిచింది.

"నేనుచనిపోతే - నాకోసం మీరునిజంగా ఏడుస్తారా?" అని అడిగింది.

"ఏమిటి పిచ్చిమాటలు?" అన్నాను.

"నేను త్వరలోనే ఈ లోకంనుంచి అస్తమిస్తానని అనుకొంటున్నాను. నాకుప్రియమైనవన్ని తిరోహితమౌతున్నాయి. ఈవిధంగా ప్రయోజనంలేని జీవితం గడిపేకంటే చచ్చిపోతేనే బాగుండుననిపిస్తుంది. నేను నిజంచెబుతున్నాను. నామనస్సులో ఎన్నోవిచారాలు—బాధలు వున్నాయి.

ఆరోజంతా వినత విచారంగానే వుంది. ఆమెచిత్తంలో నాకు బోధపడని తుపాను ఏదో రేగుతున్నది. ఆమె నావంక పదేపదే చూస్తూవుంది. ఆచూపులు నాహృదయంలో శాంతిని భంగపరుస్తున్నాయి. ఆమెశాంతంగానే కనబడుతూవుంది. ఆమె నావంక చూసినప్పుడల్లా "అనవసరంగా మనస్సును బాధపెట్టుకోవద్దు" అని చెప్పాలనే కోరిక జనించింది.

ఆమెముఖంలో వెల్లదనం స్ఫురించినా, ఆమె విశాల నయనాంచలాలలో విషాదరేఖలు ద్యోతకమైనా ఆమెనిస్తుల సౌందర్యం ఎంతమాత్రం చెక్కు-చెదరకుండా వుంది.

చీకటిపడినపిదప నేను ఎస్టేట్‌కు బయలుదేరగానే గేటువరకూవచ్చివినత"మీరు హుషారుగా లేరు.ఎందుచేతనోగాని"అంది.

నావలోకూర్చుని, "ఒకవేళ వినత నన్ను ప్రేమిస్తున్నదా?" అనుకొని ఒకదీర్ఘనిశ్వాసాన్ని విడిచాను.

# 13

మనుసటి రోజు ఉదయంకూడా ఒకవేళ వినత నన్ను ప్రేమించడం లేదుకదా అనే తట్టింది. ఆమె దివ్య సుందర విగ్రహం నా మనఃఫలకంలో గాఢంగా అంకితమైపో యింది. ఆమెను మరచిపోవడం అసాధ్యమైంది.

క్రికెఫీల్డుకు వెళ్ళాను. ఆ రోజంతా అవస్థె ఇంటనే గడి పాను. కానివినత ఒకటి రెండుసార్లు మాత్రమే కనిపించి వెళ్ళి పోయి తనగదిలో పడుకొంది. ఆమెకు ఒంట్లో బాగాలేదు. తలనొప్పితోను, జ్వరంతోను బాధపడుతున్నది. ఆమెనాకు కనిపించినపుడు ఓపిక లేకపోయినా మందహాసం తెచ్చిపెట్టు కొంది.

“మరేంకాదు. అది వట్టిభ్రమేకావచ్చు. తిరిగిసర్దుకొం టుందిఅంది. ఆమెమాటలు నాకు బోధపడలేదు. నాకేమీ తోచలేదు. కొంతసేపుండి ఆతర్వాత ఎస్సెన్‌కు తిరిగివచ్చే శాను. వచ్చానేగాని ఇంటికివెళ్లక నగరంలోకివెళ్లాను. అక్కడ కాలంగడిపి రాత్రిపదుగంటలకు ఇల్లుచేరుకొన్నాను.

మరునాటి ఉదయం కూడా ఏమీ తోచింది కాదు. కాసేపు కలకత్తాలోని నా మిత్రులు ఒకరిద్దరికి లేఖవ్రాయా లని కూర్చున్నాను గాని ఉత్తరాలు వ్రాయడం సాగలేదు. పత్రిక చదివాను. వార్తలు తలకెక్కలేదు. బొమ్మలపుస్తకం తీశాను. అనిఅన్నీ వికృతంగా నన్ను వెక్కిరిస్తున్నట్లుగా కని పించాయి.

ఏమీతోచక తిరిగి నగరంలోకి వెళ్ళి — ఒంటిగంటకు ఇంటికివచ్చేసరికి ఓ పన్నెండేళ్ళ జర్మన్ బాలుడు గుమ్మంలో కూర్చునివున్నాడు.

"బోసుబాబు మీరేనా ?"

"అవును. ఏ"మని అడిగాను.

"వినత ఈచీటీమీకిమ్మంది" అన్నాడు. నేనుఆవేగంతో ఆచీటి చదివాను.

"అత్యవసరంగా మిమ్మల్ని కలుసుకోవాలి. సాయం కాలం నాలుగు గంటలకు ఆవేళమనం వెళ్ళామే శిథిలదుర్గం అక్కడకురండి. వేచివుంటాను. నేను చాలా ఘోరమైన తప్పు చేశాను. "వస్తాను"అని లేకపోతే "రాను"అని మాత్రమే చీటి తెచ్చిన కుర్రవానితో చెప్పండి."

"వస్తా"నని చెప్పాలన్నాను. పిల్లవాడుపరుగెత్తుకుపోయాడు.

# 14

గదిలోకి వెళ్ళి కూర్చున్నాను. నా గుండెలు వేగంగా కొట్టుకోనసాగాయి. వినత పంపిన ఆ చిన్న లేఖను ఎన్నోసార్లు చదివాను. చేతనున్న రిస్టువాచీవంక చూచాను. రెండుగంటలైనా కాలేదు.

ఓరగావున్న తలుపును త్రోసుకొని, అవస్థే లోపలకు వచ్చాడు. అతనిముఖంలో విచారం స్పష్టంగా కనిపిస్తూవుంది. అశాంతితో, ఆందోళనతో కుమిలిపోతున్నట్లుగా కనిపించా డతడు.

"ఏమిటి భాయీ! అలావున్నావు ?"

"నా మంచానికిఎదురుగావున్న ఒకకుర్చీని దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు.

"నాలుగు రోజులక్రితం వినత వృత్తాంతాన్ని చెప్పాను. మీకు నేను ఇవాళ మరోవిశేషం చెబుతాను. మొన్న నేను చెప్పింది మీకు ఎంత ఆశ్చర్యంకలిగించిందో, ఇవాళ చెప్పేది అంతకంటె ఎక్కువ ఆశ్చర్యంకలిస్తుంది. మన ఇద్దరిమనస్సులు కలిశాయి కనకనే నేను ఈ మర్మాన్ని మీకు వెల్లడించడానికి సాహసిస్తున్నాను. ఇంకొకరైతే చెప్పివుండకపోనునేమో!"

పడుకొనివున్నవాణ్ణి నేను లేచికూర్చున్నాను. "మీ చెల్లెలు మాటా ?" అన్నాను.

"అవును. ఆమె కిప్పుడు పిచ్చెత్తిందో ఏమో, ముందు నా మతి పోగొడుతోంది. వినతలో ఒకేఒక సుగుణంవుంది. ఎప్పుడూ అబద్ధం ఆడదు. అన్నీ యథాతథంగా చెప్పివేస్తుంది.

"నిన్న ఆమె జ్వరంతో బాధపడడం మీరు చూసే వెళ్ళారుకదూ ? పగలూ, రాత్రికూడా ఆమె ఏమీతినలేదు. రాత్రి ఆమెకు జ్వరం తీవరించింది. రెండుగంటలకు పరిచారిక నన్నులేపింది. వినత ఏడుస్తున్నదని చెప్పింది. నేనువెళ్ళి చూశాను. ఆమె వెక్కివెక్కి ఏడుస్తుంది.

"ఏం ? నీ ఒంట్లో బాగాలేదా అని అడిగాను. ఆమె ఏడవడం జోరయింది. వెక్కివెక్కి ఏడుస్తూనే తాను మరి కొంతకాలం జీవించాలనే కనక నేను కోరితే—ఎక్కడికైనా తీసుకుపొమ్మంది. నాకు ఆ మాటలు ఏమీ బోధపడలేదు…

ఏడుపు మాని అసలు సంగతేమిటో—ఆమె మనస్సును భయోద్విగ్నంచేసిన విషయమేమో చెప్పమని అడిగాను.

ఏడుస్తూనే ఆమె మిమ్మల్ని ప్రేమిస్తూన్నానంది. రమాకాంత బాబూ! నన్ను మీరు క్షమించాలి. మనం ఉత్తమ కుల సంజాతులం, విద్యాధికులం, న్యాయాన్యాయా విచక్షణ చెయ్యగల ధీశక్తి మనకుఉంది. ఆమె మనస్సు నవనీతంవంటిది. ఏదైనా ఒక అభిప్రాయం కలగనేగలగదు. కలిగితే అది ఓ మానాన తొలగిపోదు.

"మీరు ఆమెకు నచ్చివుండవచ్చు. అయితే అంతగా బాధపడి ఏడవడం ఎందుకు? ఎవరికీ అర్థంకానంత గాఢంగా మిమ్మల్ని ప్రేమించడం దేనికి? మొదట చూసినపుడే మీరంటే తనకు ఏదో ఆకర్షణ ఏర్పడిందట. ఏదో చెప్పరాని మమకారం, కాంక్ష, ప్రేమ ఉత్పన్నమై ఆరోజుకారోజు ఆమెను నిశివేళల్లో దహించినవట. తాను మొన్న "నిన్నే ప్రేమిస్తాను—ఎవరిని ప్రేమించను" అని నాతో చెప్పినపుడు వెక్కి-వెక్కి ఏడ్చినది అందుకోసమేనట.

"నా జన్మవృత్తాంతం ఆయనతో చెప్పావా అని అడిగింది. నేను లేదన్నా విశ్వసించలేదు.

"ఇప్పుడు ఆమెకు ఒక్కటే పట్టుదల. వెంటనే ఎక్కడికైనా బయలుదేరి వెళ్ళిపోదామని. ఇక ఒక్కక్షణం ఈ క్రికెట్ ఫీల్డ్‌లో వుండకూడదని మంకుపట్టు పట్టుకుని కూర్చున్నది. బయలుదేరి వెళ్ళిపోయేవరకు ఆహారం ముట్టనని—నిద్రపోననీ శపథం పట్టింది.

"నేను చాలాసేపు యోచించాను. వెళ్ళిపోవడానికి ముందుమనకున్న చనువును, మైత్రినీ పురస్కరించుకునిఅయినా ఒకసారి మీతో మాట్లాడడం యుక్తంకాగలదని నిశ్చయించుకున్నాను. ఇక్కడినుంచి వెళ్ళిపోదామని సూచించడంలో వినత విజ్ఞతనే కనబరించిదని నాకు తోచింది. అయితే ఒక అభిప్రాయంకలిగింది. దానిమీదనే నేను ప్రయాణాన్ని అలా నిలిపివుంచి ఇక్కడకువచ్చాను.

"బహుశా వినత మిమ్మల్ని మనస్ఫూర్తిగా ప్రేమించివుండవచ్చు. భగవన్నిర్ణయం ఎలావుందో ఎవరూ చెప్పలేరు గదా! ఒకవేళ ఆమె యథార్థంగా మిమ్మల్ని వలచేవుంటే- ఆమెను వారించడానికిగాని—మీనుంచి వేరుచేసి ఎక్కడికో తీసుకుపోవడానికిగాని నేనెవర్ని? అదిగాక నేనుకూడా ఒకటి రెండుసందర్భాలలో...సరే ఏమైనా మీతో సంప్రతించి ఏదో ఒకమాట తేల్చుకొందామనే ఇక్కడకువచ్చాను."

"మీచెల్లెలంటే నాకు ఇష్టమో కాదో తెలుసుకొనడానికి వచ్చారు. అవునా. ఇష్టమే."

అవస్థి ఒకక్షణంఆగి "అయితే ఆమెను పెళ్ళిచేసుకొనడం ఇష్టంకాదా?" అని అడిగాడు.

"అది నేనెలాచెప్పను. మీరు నిర్ణయించవలసిన విషయంకాదా మీ చెల్లెలి పెళ్ళిమాట."

"నిజం. ఆమాట ఇప్పుడు అడగడం సబబుకాదు. కాని ఏమిటిచెయ్యడం. ఆమె అగ్నిజ్వాల. ఏపనైనా చెయ్యగలదు.

ఆమెకు వ్యూహ తెలిసినతర్వాత ప్రేమించి బాధపడడానికి ఇదే మొదలు. ఆమె జబ్బుపడగలదు. ఎవరికి చెప్పకుండా ఎక్కడి కైనా పారిపోగలదు. తన్ను రహస్యంగా కలుసుకొమ్మని మిమ్మల్ని కోరగలదు. మరెవరైనా అయితే తమప్రేమను పైకివెలిబుచ్చక—నిరీక్షించేవారు. ఆమె అలాకాదు. నేటి ఉదయం నా కాళ్ళదగ్గరకూర్చుని వినత ఏడ్చినపుడు చూసి వుంటే, నా భయాందోళనలు అకారణమైనవికావని మీరు గ్రహించగలిగేవారు."

"రహస్యంగా కలుసుకోమని మిమ్మల్ని కోరగలదు" అన్న ఆతనిమాటలు విన్నమీదట—అతడు అంత నిష్కప టంగా మాట్లాడుతున్నపుడు వినత పంపిన చీటిమాట దాచడం అపరాధంగా తోచింది.

"మీరు ఉన్నసంగతి చెప్పారు. ఒకగంటక్రితమే వినత నాకు చీటిపంపింది. ఇదిగో ఆ చీటీ" అని అవస్థికిచ్చాను. ఆ చీటీ నతనుచూశాడు. అతనిముఖం ఎందుకో వివర్ణమయింది.

"మీరు గౌరవనీయులు. నాకు హృదయమిచ్చిన మిత్రులు, ఇప్పుడు మనకర్తవ్యమేమిటి? క్రెఫెల్డ్నుంచి తక్షణమే వెళ్ళిపోదామని ఏడ్చి రాగాలుపెడుతూ—మిమ్మల్ని రహస్యంగా కలుసుకొనమని కోరడంలోని ఆంతర్యంఏమిటి? ఆమె ఈ చీటీ ఎప్పుడువ్రాసింది? ఎలా పంపింది? మీతో సంభాషించ నభిలషించినదేమి?"

నేను అతణ్ణి శాంతం వహించవలసినదని కోరాను. ఉభయులమూ కర్తవ్యాన్నిగురించి చర్చించాం.

ఆమె కోరినప్రకారం నేనువెళ్ళి—పరిస్థితిని సమగ్రంగా వివరించాలని—నేను ఆమెను కలుసుకొన్నట్లుగానీ, ఆమెచీటీ పంపినట్లుగానీ తనకు తెలియనట్లు నటించాలనీ, ఆ తర్వాత ఇద్దరం తిరిగి కలుసుకొనడానికి నిశ్చయించుకొన్నాం.

"మిమ్మల్ని సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను. రమా కాంతబాబూ! ఆమెను నన్నూ మీరు కనికరించాలి. ఆమెను మీరు పెళ్ళిచేసుకొంటానని మాట ఇవ్వలేదు. కనక ఎలాగా రేపు వెళ్ళిపోవడానికే నేను నిశ్చయించుకొన్నాను."

"దయవుంచి సాయంకాలందాకా నాకు గడువివ్వండి" అన్నాను.

"ఇస్తానుగాని మీరు ఆమెను పెళ్ళిచేసుకోరనే నా నమ్మకం ఇది ఎందుకు కలిగిందో."

అవస్థి వెళ్ళిపోయాడు. నేను మంచంపైన ఒరిగి ఆలోచించాను. నాతల తిరిగిపోసాగింది. పెద్దతుపాను సంక్షోభ—కల్లోలం నా హృదయంలో విజృంభించాయి. ఒక్క—క్షణంలో యావజ్జీవితపుబాధ్యతకు, సౌఖ్యానికీ సంబంధించినవిషయాన్ని వెంటనే నిర్ణయించుకోవలసిన అవసరం ఏర్పడింది.

పద్దెనిమిదేళ్ళ పిల్లని—చరిత్రహీనను భార్యగా పరిగ్రహించడం సంభవమా అనుకుంటూ లేచాను.

# 15

రైన్‌నదినిదాటి అవలిగట్టు చేరుకొనేసరికి మూడున్నర అయింది. గట్టుమీద నాకు ముందుగా కనబడ్డది చీటీ తెచ్చిన కుర్రవాడు. ఆకుర్రవాడు నన్నుచూసి మరొకచీటీ ఇచ్చాడు. అదీ వినతవ్రాసిందే.

అందులో శిధిలదుర్గం దగ్గర కలుసుకోవడానికి వీలుతేదనీ, నాలుగు గంటలకుగాక ఆరుగంటలకు ఫ్రాలూయిాస్ ఇంటిలో కలుసుకోమనీ వుంది. తలుపు మూడుసార్లు తట్టితే తెరువబడుతుందనీ, విధివిహితమైన ఈమార్పుకు క్షమించమనీ కోరింది.

"సరేనా?" అని ఆపిల్లవాడు అడిగాడు. సరే అన్నాను. ఇంకా రెండున్నరగంటల వ్యవధివుంది. నదీతీరంలోనే గడపుదామని ఆమెఉత్తరాలను గురించే యోచించుకొంటూ కొంత దూరం నడకసాగించి అక్కడకు ఒకఫర్లాంగు దూరంలో వున్న ఒక హోటలుకు వెళ్ళాను.

ఒక గ్లాసుబీరు తెమ్మని వెయిట్రెస్‌తో చెప్పాను. ఆ వెయిట్రెస్ ముఖం దైన్యాన్ని వెలిగ్రక్కుతూ వుంది. నా ప్రక్కనే కూర్చున్న ఒక అమెరికన్ సైనికోద్యోగి నాతో "పాపం అమ్మాయి మనస్సు ప్రియవియోగ సంజనితమైన వ్యధతో క్రుంగిపోతూ వుంది. ఆమె ప్రియునకు నేటివుదయమే నూరెంబర్గ్ బదిలీఅయింది" అన్నాడు.

నేనువవ్వాను. ఆయువతికి ఎంతకష్టం నష్టంసంభవించా యని పరితాపపడ్డాను. నాకు వినత జ్ఞాపకంవచ్చింది. నామన స్సుకూడా వ్యధితమయింది. మా సమావేశం కూడా అనుకూల ఫలితాన్ని ఇవ్వదో ఏమో! మాసంభాషణ ఏవిధంగా పరిణమి స్తుందో—సుఖస్వప్నాల ఆశాసౌధాగ్రానికే గొనిపోతుందో-విషాదదళితమైన వియోగవీధులకే గొనిపోతుందో—

"ఆమెతో ఏదివచ్చినా కష్టమే. ఆమెతో వేళాకోళం ప్రమాదకరం" అన్న అవస్థే మాటలు నా హృదయాంతరా ళంలో ప్రతిధ్వనిస్తున్నాయి. అన్న మాటలు నిలుపుకొనడా నికే ఒక కష్టసాధ్యమైన కార్యభారాన్ని నిర్వర్తించ డానికే నేను ఫ్రాలూయీ ఇంటికి వెడుతున్నాను గాని పరస్పరమైన ప్రేమఫలాన్ని అందుకొని ఆనందించడానికి కాదుగదా అను కొన్నాను.

నాలుగు రోజులకు పూర్వమే రాత్రివేళ - రైన్‌నదిలో నావపై దిగువకు షికారుపోతున్న సమయంలో ముంగురులు హిమధావళ్యంగల ఆమెచీరచెరగు గాలిపటంలా ఎగిరిపోతూ వున్నపుడు ఆమెను చూడగా నా మనస్సు సౌఖ్యానుభూతికై పొందిన ఆరాటం జ్ఞప్తికివచ్చింది. ఆ సౌఖ్యానుభూతిని ఆశించి నది నేను. అది ఇప్పుడు అనుకోకుండానే అనుభవానికి సన్ని హితమయింది. హృదయం ఊగులాడింది. కాని, ఆ విభ్రమను హృదయంనుంచి నెట్టివేశాను. నెట్టివేయడం అవసరమయింది కూడా.

ఆరుగంటలు కావచ్చింది. ఆమెను వివాహ మాడజాల ననే నిర్ధరించుకొన్నాను. తాను నన్నెలా ప్రేమిస్తున్నదో— అదేవిధంగా నేనుకూడా తన్ను ప్రేమిస్తున్నానని ఆమెకు ఎన్న టికీ తెలియబోదు" అనుకొని హొటల్‌నుంచి బయటకు వచ్చి ఫ్రౌలూయియా ఇంటివైపుగా నడిచాను.

అప్పుడే సంజచీకటులు పట్టణాన్ని ఆవరించుకొంటు న్నాయి. మెల్లగా మూడుసార్లు తలుపు తట్టగానే వృద్ధనారి ఫ్రౌలూయియా సాక్షాత్కరించి "మూడో అంతస్తుకు వెళ్ళండి" అంది.

అన్నదేకాని ఆమె నాతో కూడానే వచ్చింది. మూడవ అంతస్తు చేరుకోగానే "ఆగదిలో వుంది" అని ఆమె మరోదారి ననుసరించింది. నేను లోపలకు వెళ్ళి—తలుపు చేరవేశాను.

# 16

నేను ప్రవేశించిన గదిలో ఇంకా దీపం వెలిగించలేదే మో—కొంచెం చీకటిగావుంది. వినత ఆ చిన్నగదిలో ఎక్కడ కూర్చున్నదో కొంచెం పరికించిచూచిన మీాదటగాని కనిపించ లేదు. కిటికీదగ్గర ఒకకుర్చీపై శాలువకప్పుకొని కూర్చుంది. ఎందుకో ఆమె త్వరత్వరగా ఉఛ్ఛ్వాసనిశ్వాసాలు విడుస్తూవుంది. ఆమె తనులత గజగజ వణుకుతూ వుంది. ఆమెదగ్గరకు వెళ్ళి "వినతా" అన్నాను. ఆమె నావంక దీనంగా చూసింది. ఆమె కళ్ళు అశ్రుమయములై వున్నాయి.

"నేను...అనుకున్నాను...కాని...అలా...చెయ్యలేక పోయాను" అని గాద్గద్యం వహించిన స్వరంలో అన్నది. ఆమె విపరీతంగా ఆయాసపడివుందని నాకుతట్టింది. చాలా నీరసంగా కనిపించింది. ఆ దైన్యమూర్తిని చూడగానే నా హృదయం ద్రవించిపోయింది.

"వినతా!" అనిపిలిచాను. ఆమె మెల్లమెల్లగా దృష్టిని నాపై సారించింది—ఓహో! ఆకళ్ళలో అమృత మధురమైన మధురప్రేమ ద్యోతకమవుతుంది. నేను కొంచెం వంగి, ఆమె చేతిని ముద్దుపెట్టుకున్నాను.

ఆమె ఒక నిట్టూర్పు విడిచింది. నా శిరస్సుపైన మెల్లగా ఆమె చేతివ్రేళ్ళు కదలినట్లయింది. ఆమెవంక చూచాను. ఆ ముఖంలో కళ్ళలో అంతకుముందు ప్రతిఫలించిన నైరాశ్యం దైన్యం అంతర్హితమైనాయి. ఎర్రకలువ రేకుల్లాటి ఆమె పెదిమలు కదిలాయి. పాలరాయిలా తెల్లనై వున్న ముఖంలో హాస ద్యుతులు వెల్లివిరిశాయి. ముంగురులు కిటికీనుంచి వీస్తున్న గాలికి అల్లలాడుతున్నాయి.

ఒకక్షణం—ప్రపంచాన్నే పూర్తిగా విస్మరించాను. ఆమెను లేవదీశాను. అక్కున చేర్చుకున్నాను. కౌగలించుకొని, ఆమెబుగ్గలను అధరాలను ముద్దుపెట్టుకొన్నాను. "రమాకాంతబాబూ నీ చరణదాసిని" అంది మెల్లగా నా కళ్ళలోకి చూస్తూ.

ఇంతలోనే అవన్నీ పలుకులు నా హృదయాంబరాన ఉరుముల్లా గర్జించాయి. ఏమిటది; మనం ఏంచేస్తున్నాం? అని రెండడుగులు వెనక్కు వెళ్ళాను.

"మీ అన్న కిది అంతా తెలిసిపోయింది. మనం ఇక్కడ కలుసుకుంటున్నా మనికూడా? అంతా అతనికి చెప్పి వేయక తప్పిందికాదు" అన్నాను.

"ఏం? ఎందుకు చెప్పకతప్పింది కాదు?"అని ప్రశ్నించింది.

"నువ్వుకూడా ముందు అతనితో నన్ను ప్రేమిస్తున్నట్లు చెప్పి వేయడంచేత. అతడు నాదగ్గరికివచ్చి నువ్వు చెప్పిందంతా వల్లించాడు. "ఇప్పుడు అంతా ముగిసిపోయింది" అన్నాను.

నేను రెండడుగులు వెనుకకు వేయగానే కుర్చీలో కూల బడిన వినతలేచి వెళ్ళిపోవడానికి యత్నించింది.

"ఉండు. ఒక్కక్షణం ఆగు. నన్నువిడిచి అలా వెళ్ళిపో కూడదు. మనసంగతి మీఅన్నతో ఎందుకు చెప్పావు?"

"నేనేం రమ్మని అతణ్ణి పిలవలేదు. అతనే నాగదిలోకి వచ్చి అడిగితే చెప్పాను."

"బాగానేఉంది. కాని ఒక్కక్షణంకూడా ఇక్కడ వుండ కుండా వెళ్ళిపోవాలని ఎందుకు అతనితో అన్నావు?"

"అవును. వెళ్ళిపోవాలనే అన్నాను. మిమ్మల్ని ఇక్క డకురమ్మని చీటీవ్రాసింది మీతో వెళ్ళిపోతున్నాననే మాట చెప్పడంకోసమే."

"అయితే నిన్ను వదిలిపెట్టి నేనేం కావాలని? వినతా! ఎందుకు మీ అన్నతో మన ప్రేమమాట చెప్పవలసి వచ్చింది?"

"నేను ఏడుస్తూ వుంటే దాసీమనిషి వెళ్ళి చెప్పినట్లుంది. పోనీ, నాదితప్పే. మరి ఈ రహస్యసమావేశంమాట అతనితో మీ రెందుకు చెప్పారు?"

"విధిలేక, అతణ్ణివంచించడం ఇష్టంలేక. సరే. ఇకమనం చెయ్యదగినది ఏమీలేదు. విడిపోవడమే కర్తవ్యం." అని ఆమె వంక చూశాను.

ఆమెకళ్ళు రక్తారుణిమ వహించడం ఆ చీకట్లోకూడా స్పష్టంగా కనిపించింది. ఆమె సిగ్గుపడి పోయినట్లు-భయపడ్డట్లు కనిపించింది. నేనుఆగదిలో ఇటూఅటూ పచారుచేస్తూ ఉద్రేకంతో "హృదయంలో కొన్నిభావాలు ఉదయించి పరిపక్వం కాకుండానే — ఒక స్థిరపరిణతిని పొందకుండానే మనమైత్రికి భంగం కలిగించావు. నన్ను విశ్వసించావు కావు. సందేహించావు" అన్నాను.

ఆమెచేతులతో ముఖాన్నికప్పుకొని వలవలఏడ్చింది.

"వినతా! ఏడవకు. నామాట విను." అన్నాను ఆమె మానదే.

ఉన్నట్లుండి ఆమె లేచి తటాలున ఆగదిలోనుంచి ఒక్క మెరుపులా బయటకు మాయమయింది. నేను విభ్రాంతుణ్ణయి, అలాగే నిలబడిపోయాను.

కొన్ని నిమిషాలకు పిమ్మట ఫ్రాలాయిూ గదిలోకి వచ్చి, దీపం వెలిగించి, నిశ్చేష్టుడనై వున్న నన్ను చూసి "చిన్నారి వెళ్ళిపోయిందా ?" అని అడిగింది.

ఆమెవంక మూఢునివలె ఒకసారి చూసి, నేను బయటకు వెళ్ళిపోయాను.

## 17

నేను తొందరగా రైన్‌నదీతీరానికి వెళ్ళాను. ఒంటి నిండా తేళ్లు, జెర్రులు ప్రాకినట్లుంది. తగని ఆవేదనతో శరీరం ఆపాదమస్తకమూ కాలిపోతూవుంది. హృదయంలో మహాదారుణమైన తుపాను రేగుతూవుంది. నా అవ్యక్తతకు, అవివేకానికి నన్ను నేనే నిందించుకొన్నాను. సమావేశ స్థలాన్ని శిథిలదుర్గంలోగాక, ఫ్రాలాయిూ ఇంటికి మార్చవలసిన అవసరం ఏమివచ్చిందో నేను అడగనైతినే అని బాధపడ్డాను. ఆమె తనహృదయాన్ని మహోజ్వలమైన ప్రేమతో నాకు అర్పించినపుడు ఎందుకు వెంగలినై తిరస్కరించానా అని పరితపించాను.

ఆ గదిలో ఎంతధైర్యంగా, ఎంతనిర్దయగా ఆమెను తృణీకరించి, ఆమెచిత్తాన్ని గాయపరిచానా, తుదకు ఆమెను నిందించడానికికూడా ఎందుకు సిద్ధపడ్డానా అని కుమిలిపోయాను.

నిరాశ మూర్తీభవించిన తను ఇప్పుడు నన్ను వెన్నంటుతూన్నట్లుగా వుంది. ఆమెను మనసారా కోరుకోవాలను కొన్నాను. ఆ పాలిపోయినముఖం, సుఖబాష్పాక్రాంతము లైన ఆ విశాలనేత్రాలు అతికోమలమైన తన వ్రేళ్ళతో నా శిరోజాలను స్పృశించిన సంఘటన—నా గుండెలపై తనశిరస్సును అనుకొని "మీ చరణదాసిని" అన్న చల్లనిమాట... నీటినిగురించే తెలుసుకొనే చిన్నపిల్లవానిలా ఏడ్చాను.

నిజంగా మా ప్రేమ ఈ రీతిగా అంతమొందాలనే నేను ఊహించానా? ఆమెను విడిచిపెట్టి జీవించడం నాకు సాధ్యం కాగలదా? ఆమెను చూడకుండా నేను ఒకక్షణం నిలవ గలనా? ఓయీ ఉన్మాదీ!. ఓయీ ఉన్మాదీ అంటూ నన్ను నేనే తిట్టుకొని వాపోయాను. నా హృదయాన్ని విషాదం క్రమ్ముకుంది. ఏమీ తోచిందికాదు—తిరిగి అవతలి ఒడ్డుకు బయలుదేరాను.

# 18

నా రాకను కిటికీనుంచో, గదినుంచో గమనించే కాబోలు అవతలి గేటుదాకా తనే చరచరవచ్చి "వినత కనబడిందా?" అని అడిగాడు.

"ఆమె ఇంటికి తిరిగిరాలేదా" అని నేను అడిగాను.

"రాలేదు. అయితే నాదేతప్పు. ఎంతసేపటికీ తిరిగిరా లేదని—ఇక ఓర్చుకోలేక ఆశిథిలదుర్గందగ్గరకు నేనువెళ్ళాను.

మన ఏర్పాటుకు భిన్నంగా ప్రవర్తించాను, ఆమె అక్కడ లేదా అక్కడకు ఆమె రానేలేదా ఏమిటి ?"

"అక్కడకు రాలేదు."

"మీరు వినతను కలుసుకోనేలేదా ?"

"కలుసుకొన్నాను, కాని దుర్గందగ్గర కాదు. ప్రొలూయిా ఇంటిలో."

"ఎంతసేపయింది మీరు ఆమెను కలుసుకొని."

"సుమారు ఒకగంటయింది. ఆమె ఇంటికి తిరిగివచ్చి వుండాలనుకొనే నేనువచ్చాను."

"అయితేఆమెవచ్చేవరకు వేచివుందాం."అన్నాడుఅవస్థి.

ఇద్దరమూ ఇంటిలోకి వెళ్ళాం, ఏమిజరిగిందని అతడు అడగనూలేదు. నేను చెప్పనూలేదు. ఒక పావుగంట అలా నిశ్శబ్దంగా గేటువంక చూస్తునే కూర్చున్నాం. ఆమెరాలేదు.

"నేనుఇక నిరీక్షించలేను. నా ఓర్పుకుకూడా ఒక మితి వుంది. ఆమె నాచావుకే ప్రాప్తమయింది. రండి, వెదకుదాం" అన్నాడు అవస్థి.

ఇద్దరం తిరిగి వీధిలోకివచ్చాం.

"ఏం జరిగింది?" అనిఅడిగాడు అవస్థి.

"అనుకొన్న ప్రకారమే ఆమెతో చెప్పివేశాను. అయిదు నిమిషాలు మాత్రమే నేను ఆమెతో సంభాషించాను."

"ఇద్దరమూ ప్రొలూయిా ఇంటికి రెండు దిక్కులుగా వెడితే మనపని సులువవుతుంది. ఒకగంట తర్వాత మళ్ళీ మీరిక్కడకు రండి" అన్నాడు అవస్థి.

# 19

నగరంలోకి తిరిగి బయలుదేరాను. ప్రతి సీధి, ప్రతి సందూ, వినతకోసం చూశాను. ఫ్రౌలాయినీ ఇంటికి వెళ్ళాను. మూడవ అంతస్థులో నేను ఆమెతో ఏగదిలోనైతే సంభాషించానో ఆగదికిటికీ తెరిచేవుంది. అయితే పైకి వెళ్ళలేను. ఎగువకు వెళ్ళాను అన్నివీధులుతిరిగి — నదీతీరానికి వచ్చాను.

వినత ఎక్కడకు వెళ్ళివుంటుందా, ఈ గంటసేపు ఏమి చేసివుంటుందా అని పరిపరివిధాల పోయింది నామనస్సు. ఒక వేళ ఏదైనా సాహసానికిగాని ఒడిగట్టి వుండదుగదా అని మనస్సు డోలాయమానమయింది.

నదీతీరాన ఎందరో జర్మన్ యువతులు-యువకులు కనిపించారు. వారి ముఖాలలో ఆనందం, వారి హృదయాలలో ఆనందం—మరి నాహృదయమో—కొన్నిగంటలకు పూర్వం అనంతానంద నిలయం. ఇప్పుడో కటికచీకటి కోణం.

చేజేతుల తన హృదయసర్వస్వాన్ని అర్పించి, తన జీవితాన్ని నాచరణసేవకు అంకితమీయ నిశ్చయించుకొని, తెగువతో వచ్చిన ముద్దరాలిని — నిష్కారణంగా అవమానించి, గాయపరిచిన క్రూరుణ్ణి--నాకు--నా దుశ్చర్యకు భగవంతుడు తగినశిక్ష విధించడా? నాపాతకానికి నిష్కృతి వుండగలదా?

ఆమెప్రేమను అంగీకరించాననే ఒక్కమాటను చెప్పివుంటే, ఆమె వదనమండలంలో ఆనందజ్యోత్స్న వెల్లివిరిసి

వుండేదిగదా! ఆమెను ఎందుకు తృణీకరించి మహోద్రాగుణ్ణైన పాపానికి ఒడిగట్టాననే చింత నిలువున దహించగా-ఉన్మత్తుని వలె—వినతా! నిన్నే ప్రేమిస్తున్నాను, నిన్ను వదలిపెట్టను, ప్రమాణంచేస్తున్నాను. నామాటనమ్ము"అని ముందుమెల్లగా-ఆ తర్వాత బిగ్గరగా విలపించాను.

వినతా, వినతాఅని గొంతెత్తి పిలిచాను. నాపిలుపు ఆ చీకటిలో—ఆ నదీతరంగాల మర్మరధ్వనిలో లీనమైపోయిందే కాని బదులులేదు.

ఎట్టెదుట- నది ఆవలితీరంలోని చెట్లు-పైన మబ్బులు-ప్రక్కని హోరుమంటూనది—నన్ను చూసి వికటంగానవ్వుతూ గేలిచేస్తున్నట్లు తోచింది. నా మనస్సులో ఏదో భయం ప్రవేశించింది. దిగులుతో—బరువైన హృదయంతో అవస్థి ఇంటికి తిరిగి బయలుదేరాను.

# 20

అవస్థి ఇంటి కిటికీనుంచి దీపకాంతి బయటకు ప్రసరిస్తున్నది. అదిచూడగానే నాహృదయానికి కొంచెం ధిటవుకలిగింది. తలుపులు బంధించబడి వున్నాయి. తట్టాను. అవస్థి బయటకువచ్చి—మెల్లగా నా చెవిలో "పసతవచ్చింది. ఇంతవరకు అంతా సక్రమంగానే వుంది" అన్నాడు.

నాకుఎంతో సంతోషం కలిగింది. "అన్నపూర్ణ రక్షించింది. మిత్రమా! మనస్సు ఎన్నిందాల పోయిందనుకొన్నారు?

అయితే మనం తిరిగి కలుసుకోందాం అనుకున్నాం గదా.” అన్నాడు.

“తప్పకుండాను. రేపు కలుసుకొందాం. క్షమించండి ప్రస్తుతానికి సెలవు” అన్నాడు అప్తే.

“గుడ్ నైట్—రేపు ఈ సమస్య పూర్తిగా పరిష్కారమై పోతుంది. మీరు భయపడకండి” అని చెప్పి నేను బయలుదేరాను. అతడు లోపలకు వెళ్ళి తలుపులు బంధించుకొన్నాడు.

పదిగజాలదూరం వెళ్ళి ఆగాను. రెండు నిముషాలపాటు నిలబడి, తిరిగి తలుపుదగ్గరకు వచ్చాను.

తలుపు తట్టా నేమోకూడా. వినతను పెళ్ళి చేసుకొనడా నికి నిశ్చయించుకొన్నానని చెప్పిపోదామనే నావుద్దేశం; ఐతే ఆ సమయంలో చెప్పడం అసమంజసమేమో అనిపించింది.

కానీ రేపుప్రదయమే చెప్పవచ్చు. ఆలోగా మించిన దేమీలేదు. రేపు ఆమాట అతనితోను—వినతతోను కూడా చెప్పి. వారికి అవధిలేని ఆనందాన్ని కలిగించవచ్చు. నేనుపొంద వచ్చునుకూడా అనుకొని వెనుదిరిగాను.

ఒక్కరాత్రి ఎనిమిదిగంటలసేపు ఓర్చుకుంటేచాలు— నేను ధన్యుణ్ణికావడానికి - నాజీవితం సార్థక్యం పొందడానికి.

రేపు నేను ఎంతో సౌఖ్యం అనుభవించగలను. సౌఖ్యానికి రేపనేది లేదు. నిన్న అనేది లేదు. దానికి గతంతో సంబంధం లేదు. దానినిగురించిన తాపత్రయమూ లేదు. దానిని అనుభ వించిన ఆ ఒక్క రోజే—ఒక్క నిముషమే—ఒక్క క్షణమే ప్రధానం. అదేచాలు.

నేనుతిరిగి ఏస్సెన్‌కు ఎలా చేరుకున్నానో-ఎంత సేపట్లో చేరుకున్నానో చెప్పలేను. రెక్కలువచ్చి ఎగిరి వెళ్ళానా అని పించింది. నావనుంచిదిగి ఇంటికి వెడుతూంటే ఒకపక్షి కిలకిల మంటూ ఏదోపాడుతూవుంది. అది మా ప్రేమనుగురించే—వినతా రమాకాంతుల వివాహ మంగళగీతాన్నే పాడుతున్నట్లుగా స్ఫురించింది.

# 21

తెల్లవారగానే కాలకృత్యాలు తీర్చుకొని, స్నానంచేసి కాఫీత్రాగి క్రెఫెల్డుకు బయలుదేరి వెళ్ళాను. అవస్థే బసచేసిన ఇల్లును సమీపించాను. సాధారణంగా అన్నికిటికీలు తెరిచివుంచే అలవాటు లేదతనికి. కాని, నేటిఉదయం అన్ని కిటికీలు తెరువబడివుండడం నాకు ఆశ్చర్యంకలిగించింది.

సింహద్వారంముందు ఏవోకాగితాలు ఉత్తరాలు చింపి వేయబడిన ముక్కలు పడివున్నాయి. నేనుగుమ్మంలో అడుగు పెట్టేసరికి దాసీమనిషి చీపురుతో ప్రత్యక్షమయింది.

"అవస్థే ఇంటిలోవున్నాడా?" అని నేను ప్రశ్నించేలోపుగానే ఆమె జర్మన్‌భాషలో వారు వెళ్ళిపోయారని చెప్పి—ఆ భాషనాకు అర్థంకాదేమో అనుకొని సంజ్ఞచేసింది.

"ఎక్కడికి వెళ్ళా"రని నేను ప్రశ్నించాను.

ఆమెకుకొంచెంగా ఇంగ్లీషువచ్చు. అయితే తప్పులతో మాట్లాడితే నవ్వుతారనిభయం. మెల్లగా తడబడుతూ ఉదయం

పనుస్నరగంటలకే వెళ్లిపోయారని——ఎక్కడికి వెళ్లారో తెలియదని చెప్పింది. ఒకనిమిషం వుండమని చెప్పి, లోపలకు వెళ్ళి ఆమె ఒకఉత్తరాన్ని తెచ్చిఇచ్చింది.

నాశిరస్సుపై పిడుగుపడినట్లయింది. ఆ వుత్తరం అవస్థే వ్రాసినది. దానిలో ఇలావుంది.

"మిత్రమా! మీతో చెప్పకుండా——సెలవు పుచ్చుకో కుండా వెళ్ళిపోయినందుకు క్షమించండి. ఆగ్రహించకండి. నేను ఇలాహఠాత్తుగా వెళ్ళిపోవడానికి చేసుకొన్ననిర్ణయం సక్రమమైనదే అని మీరుకొంచెం నిదానంగా యోచించిన మీదట అంగీకరించక మానరు. పరిస్థితి మహావిపత్కరంగా పరిణమించిన సందర్భంలో ఇంతకంటె వేరొక ఉత్తమనిర్ణయం నాకు తోచలేదు. మానవ ప్రకృతిలోని విలక్షణాలను——ప్రవృత్తులను నేనుమన్నిస్తాను. మీరువినతను ప్రేమించి వుండవచ్చు. కాని వెళ్ళిచేసుకొనడానికి ఇష్టపడనట్లు ఆమె చెప్పింది.

"ఇక ఆమె వుండదలుచుకొనలేదనీ, వెళ్ళిపోదామని పట్టుపట్టింది. బ్రతిమాలింది. ఏడ్చింది. ఆమె మనస్సును బాధించడం నా అభిమతంకాదు. ఆమెకు మనశ్శాంతి కలగడం కోసమైనా, ఆమెమాటను అంగీకరించడం నాకు తప్పనిసరిఅయింది.

"మనపరిచయం ఆకస్మికం. ఐనప్పటికీ ప్రగాఢ మైత్రికి ఆపరిచయం దారితీసింది. అది ఇంతలోనే ఈవిధంగా సమాప్తి నొందగలదని నేను ఊహించలేదు. వినతను వివాహమాడడానికి మీరు సమ్మతించలేదని నాకు ఏమాత్రం కోపంలేదు.

నన్ను క్షమించండి. సహజంబహుశా తిరిగికలుసుకోవడం అసంభవమే కావచ్చు. కాని ఈస్వల్పకాలపు పరిచయ స్నేహాలను నేను ఆజన్మాంతం జ్ఞాపకంవుంచుకొంటాను. మాకోసంమీరు వెతకవద్దు"—గోవింద్ అవస్థే.

"ఏమిటీ విలక్షణాలూ, ప్రవృత్తులూను? ఏమిటీ పిచ్చి వుత్తరం, నన్ను ఆమెను వేరు చెయ్యడానికి ఇతనెవరు? అయ్యో! భగవంతుడా!" అని రెండు చేతులతోను నాతలను పట్టుకొన్నాను. నా శిరస్సుపైన వెయ్యిగొడ్డళ్ళతో మోదినట్లయింది. నన్ను ఈ అవస్థలో చూసి పరిచారిక ఇంటి యజమానురాలిని పిలిచింది.

ఇంటి యజమానురాలు వచ్చి ఐదున్నరకు స్టీమరెక్కి కలోన్‌కు వెళ్ళిపోయారని చెప్పింది. ఇంటికివెళ్ళి సామానుసర్దుకొని నేనుకూడా కలోన్‌కుబయలుదేరి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను. వినత ఎంతపనిచేసిందీ అని బాధపడ్డాను.

కలోన్‌కు తిరిగి స్టీమరు ఎప్పుడు బయలుదేరుతుందో కనుక్కొనడానికి బుకింగ్ ఆఫీస్‌కు బయలుదేరి వెడుతూవుండగా ఫ్రాలాయీ పిలిచింది.

పైకివెళ్ళగా ఆమె ఒక లేఖను తెచ్చియిచ్చింది. అది వినతవ్రాసింది.

"సెలవు! మనం మరెన్నడూకలుసుకోం. దురభిమానం-ఆభిజాత్యం ప్రేరేపించగా నేను వెళ్ళిపోవడం లేదు. వెళ్ళిపోక

చేసేది ఏమీలేక—గత్యంతరంలేక. నిన్న సిగ్గువిడిచి "నీచరణా దాసి'' నన్నప్పుడు కూడా మీరు "ఒక్కమాట'' అనలేక పోయారు—నన్ను ప్రేమిస్తానని నన్ను పెళ్ళిచేసుకొంటానని. అలా ఒక్కమాట అనివుంటే—ఏదెల్లా జరిగినా వుండిపోయే దాన్ని. మీరు అనలేదు కనక—మనం విడిపోవడమే యుక్త మనుకొన్నాను. సెలవు—వినత"

"ఒక్కమాట..." అయ్యో ఎంతమూఢున్ని. నిన్నరాత్రి ఆమాటని వందమాట్లు అనుకొన్నాను. పలవించాను. అయితే ఆమాట వినతతో అనలేకపోయాను. ఆమాట గాలిలో కలిసి పోయింది. నిర్జన రైన్‌నదీ తీరంలో ధ్వనించిందేకాని ఆమె చెవిని పడకపోయింది.

ఆమె తనకుతానై తన వలపు తలపులను నాకు తెలిపి నపుడు నేనుకూడా నా హృదయకవాటాన్ని తెరిచి-అందులో ముద్రితమైయున్న ఆమె జగన్మోహనమూర్తిని చూపి వుండ వలసింది. అవస్థ-నేను కలిసి ఆమెకోసం నిరీక్షిస్తున్నప్పుడైనా అతనితో చెప్పాలని తోచకపోయింది. ఆమెకోసం వీధి వీధుల వెదకినపుడే—నా హృదయంనుంచి ప్రేమ కట్లుత్రెంచుకొని పరవళ్లు త్రొక్కుతూవుంది. తిరిగి ఆమె ఇంటికివచ్చిందని తెలిసి నపుడయినా - అవస్థతో చెప్పలేకపోయాను. తిరిగి గుమ్మం లోకి వెళ్ళకుండా-వెనుకకు మరలివచ్చాను.

ఒక్క క్షణమైనా ఓర్చుకోలేని స్వభావమూ నాదని గ్రహించలేకపోయాను. చేజేతుల నా హృదయసామ్రాజ్ఞిని వదులుకొన్నాను.

ఆనాడే పెట్టె బేడా సర్దుకుని నేను కలోన్‌కు వెళ్ళి పోయాను.

## 22

కలోన్‌లో వినతా, అవస్థీలగురించి దర్యాప్తు చెయ్యగా వారు లండన్ వెళ్ళిపోయారని తెలిసింది. లండన్ వెళ్ళి వారిని అన్వేషించాను. కాని నా శ్రమ ఫలించలేదు. చాలా రోజులపాటు నామనస్సు మనస్సులో లేదు. తీరని అశాంతితో తల బ్రద్దలౌతూనే వుంది. చివరకు వారు కనిపించగలరనే ఆశ వదులుకొనక తప్పిందికాదు.

నేనుమళ్ళీ వినతను ఎప్పుడూ చూడలేదు. ఇండియాకు తిరిగివచ్చాను. కాశ్మీర్‌లో—లాహోర్‌లో దర్యాప్తు చేశాను. అవస్థీనుగురించి కొన్ని అనిశ్చితమైన వార్తలు తెలిసినవికాని వినతనుగురించి ఏమీ తెలియలేదు.

పదేళ్ళ తరవాత బొంబాయినుంచి పూనాకు వెడుతూ వుండగా రైలులో అచ్చంగా వినతలా ఒకామె కనిపించింది కాని, దగ్గరకువెళ్ళి చూడగా నా అనుమానం నిరాధారమయింది.

వాస్తవానికి వినతనుగురించి నామనస్సు ఒకటి రెండు సంవత్సరాలు మాత్రమే బాధపడింది. ఆమెతో వివాహం జరగకపోవడం విధినిర్ణయమై వుండాలని తోచింది. విభిన్న ప్రకృతులుగల వినతవంటి పిల్లను అర్ధాంగిగా పరిగ్రహించి వుంటే జీవితం సుఖభాజనం కాకపోవచ్చునని కూడా తట్టింది. అప్పట్లో నేను తరుణవయస్కుణ్ణి. భావి అనంతంగా—నిరవధికంగా కనిపించిన రోజులవి.

ఆతర్వాతకూడా నేను కొంతమంది యువతులను కలుసుకొనకపోలేదు. వారితో పరిచయం కాకపోలేదు. కాని వినత మాదిరిగా నాహృదయాన్ని ఎవరూ మధురప్రణయోత్తేజితం చేసినవారు లేరు.

ఎవరి ఆర్ద్రసంభాషణ—ఎవరిమైత్రీకూడా అంత సంతృప్తినీ—హాయినీ సమకూర్చ లేకపోయినవి. ఏకాంత జీవనమే వృత్తిగా స్వదేశాన్ని విడిచి ఎక్కడెక్కడనో ఏళ్ళతరబడిని విషాదమయ జీవితాన్ని గడపుతూ వున్నప్పటికీ — నాదగ్గర వినత ఆనాడు గ్వాలియర్ మేడమీదనుంచి విసరిన గులాబి పువ్వును నిక్షేపంలా భద్రంగా దాచుకొన్నాను.

ఆ పువ్వు రేకలు వాడిపోయినా ఆ సువాసన ఇంకా తొలగిపోలేదు. ఆ పువ్వు గిరవాటువేసిన చెయ్యి — నేను ప్రేమార ముద్దుపెట్టుకొన్న ఆ మనోహర మూర్తి ఏమైపోయిందో ఏమో.

ఇక నేనా? అపూర్వమైన ఆ మనోహరసంఘటనల సంస్మృతిలో తీరని ఆశలతో—ఊరటచిక్కని వేదనలతో కాలం వెళ్ళబుచ్చుతూ వున్నాను.

దుఃఖానికి సుఖానికి—విధికి లొంగిపోవలసింది ఒక్క మానవుడే. ఏ తోటలోనో—ఏ దొడ్డిలోనో మారుమూలలనో పెరిగే మొక్క మానవుడు గడిచి గట్టెక్కలేని సుఖదుఃఖాలకు అతీతమై తన పరిమళాన్ని పలుగడల విరజిమ్ముకొంటూ చివరకు అశాశ్వతమైనది మానవ జీవితమేనని నిరూపిస్తూ మహా వృక్షంగా పెరుగుతూనే వుంటుంది.

PRINTED AT KISHORE PRINTERS.
ROYAPETTAH, MADRAS—14.

# విఖ్యాత నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| శ్రీకాంత | (శరత్) | 7–8 |
| పల్లెజీవనం | | 2–0 |
| వాగ్దానం | | 2–0 |
| చంద్రనాథ్ | | 1–8 |
| దేవదాస్ | | 1–8 |
| అరక్షణీయ | | 1–4 |
| పరిణీత | | 1–0 |
| స్వామి | | 1–0 |
| అనుపమాదేవి | | 1–0 |
| బిందుగారి బ్బాయ్ | | 1–0 |
| బడీబహూన్ | | –12 |
| సుమతి | | –12 |
| విప్రదాస్ | | 3–0 |
| సవిత | | 4–0 |
| సుందరి | (సాంఘిక) | 2–8 |
| ఫాదరిండియా | | 1–8 |
| మదర్ ఇండియా | | 1–0 |
| హరిచకోణుడు | | 1–0 |
| గరీబ్ | | 1–0 |
| భిక్షుకి | | 1–0 |
| నాగమ్మ | | 1–0 |
| నీలకంఠం కథలు | | 1–0 |

వలయువారు


**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

**సంస్కృతాంధ్ర బుక్ డిపో [స్థా 1882] రాజమండ్రి.**

# ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ వారి
# ప్రఖ్యాత నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| మాయావి-భాగం | 1 | 2-0 |
| మనోరమ ,, | 2 | 2-0 |
| మాయావిని ,, | 3 | 1-0 |
| **264** ,, | 1 | 2-8 |
| ,, ,, | 2 | 2-8 |
| వీరపూజ | | 2-8 |
| భూతగృహం-భాగం | 1 | 2-0 |
| ,, ,, | 2 | 2-0 |
| నీలాంబరి | | 2-8 |
| పరమరహస్యము | | 2-8 |
| ప్రతిజ్ఞాపాలనము | | 2-8 |
| జీవన్మృతరహస్యము | | 2-8 |
| రహస్య విప్లవము | | 2-8 |
| జయాపజయములు | | 2-8 |
| రహస్యశోధనము | | 2-0 |
| సమాన ప్రతిభ | | 2-0 |
| రహస్యగోపనము | | 2-8 |
| లక్ష్మీకాంతము | | 2-0 |
| నీకేజయం-భాగం | 1 | 2-8 |
| ,, ,, | 2 | 2-8 |

| | | |
|---|---|---|
| లీలావతి | | 2-8 |
| శ్యామల | | 2-8 |
| సాధన | | 1-0 |
| పరిమళ | | 1-8 |
| లక్షరూపాయలు | | 1-0 |
| మరకత మంజూష | | 1-8 |
| మాధవసేనుడు | | 1-0 |
| మాధవీలత | | 2-8 |
| అమరవిజయం | | 1-8 |
| సుదిన | | 1-8 |
| చాందసుల్తానా | | 1-8 |
| రుద్రమదేవి | | 1-8 |
| అరవింద-భాగం | 1 | 1-8 |
| ,, ,, | 2 | 1-8 |
| ప్రసన్నముఖ | | 1-0 |
| మంగళసూత్రం | | 1-8 |
| అమరిన్న | | 1-8 |
| సుందరి | | 2-8 |
| శ్రీకాంత కవర్ | | 7-8 |

ప్రాప్తిస్థానం:

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు**

**సంస్కృతాంధ్ర గ్రంథాలయం (స్థా. 1882) రాజమండ్రి.**

Rajeswari Press, Rajahmundry.